# బ్రహ్మసూత్రభాష్యము

అవధూత దత్తపీఠ ఆస్థాన విద్వాంసులు,
ఇండియా కల్చరల్ సెంటర్ & టెంపుల్ ఆస్థాన విద్వాంసులు
చతుర్వేదభాష్యకారుడు
**డా॥ క్రోవి పార్థసారథి**

**మణిద్వీప మహాసంస్థానము**
పెనుశిలకోన, పొట్టిశ్రీరాములు జిల్లా.

# బ్రహ్మసూత్రభాష్యము

**డా॥ క్రోవి పార్థసారథి**

ప్రథమ ముద్రణ : డిసెంబర్ 2015

ప్రతులు : 1000



**వెల : రూ. 150-00**

ప్రతులకు :

**డా॥ క్రోవి పార్థసారథి**
23-11/1-10/2, ఓగిరాలవీధి,
సత్యనారాయణపురం, విజయవాడ-11.
ఫోన్ : 0866-2530672, 9866820574

ముద్రణ :
నిర్మలా ఆఫ్‌సెట్ ప్రింటర్స్,
గాంధీనగర్, విజయవాడ-3.

## అంకితం



**సాక్షాత్తు సరస్వతీ స్వరూపిణి**
**మాతా కరుణామయికి**

గ్రంథకర్త
క్రోవి పార్థసారథి

GENIUS BOOK OF RECORDS

INTERNATIONAL GENIUS BOOK OF RECORDS

GBR

# Certificate

## COMMENT WRITTEN ON FOUR VEDAS AFTER 634 YEARS IN INDIA AND FIRST TIME IN TELUGU

Dr. Krovi Partha Sarathi S/o Krishnamurthy (born on 13th Dec,1949) a retired Reader in Commerce, Vijayawada, Krishna District, Andhra Pradesh, India has written a comment on Four Vedas (Chaturveda Bhashyam) by name 'Partha Saratheeyam'. This Comment is written after 634 years in India and First time in Telugu Language. This achievement is entered in International Genius Book Of Record.

Verification Code..
GBR/MAY/189/2015

APPROVED GBR INTERNATIONAL

Dr.mike
Dr.Mike
President Genius Book of Records

Genius Book Of Records
www.geniusbookofrecords.com



జననం
25.10.1952

శ్రీమతి క్రోవి రమాదేవి గారు

మరణం
12.01.2014

WONDER BOOK OF RECORDS INTERNATIONAL

# Certificate

## COMMENT WRITTEN ON FOUR VEDAS AFTER 634 YEARS IN INDIA AND FIRST TIME IN TELUGU LANGUAGE

**Dr. Krovi Partha Sarathi S/o Krishnamurthy (born on 13th Dec, 1949) a retired reader in Commerce, Vijayawada, Krishna District, Andhra Pradesh, India has written a comment on Four Vedas (Chaturveda Bhashyam) by name 'Partha Saratheeyam'. This Comment is written after 634 years in India and First time in Telugu Language. This achievement is entered in International Wonder Book Of Record.**

APPROVED WBR INTERNATIONAL ACHIEVEMENTS

Verification Code:
WBR/MAY/383/2015

Neelam
PRESIDENT
WONDER BOOK OF RECORDS

**WONDER BOOK OF RECORDS**
**www.wonderbookofrecords.com**



Sri Mouna Swamy





Sri Siddheswarananda

# SRI SIDDHESWARI PEETAM

**Mounaswamy Mutt, Courtallam (T.N.) - 627802**

**Peetadhipati :** ***Paramahamsa Parivrajakacharya, Jagadugur,***

**SRI SIDDHESWARANANDA BHARATI SWAMY**

## ఆశీర్వాద శ్రీముఖము

డాక్టర్ క్రోవి పార్థసారథి గారు సుప్రసిద్ధులు. ఆధ్యాత్మిక రంగంలో అపారమైన కృషి చేసి ఎన్నో గ్రంథాలు రచించిన వారు. ఇప్పుడు రచించిన యీ గ్రంథము సామాన్యమైనది కాదు. బ్రహ్మసూత్రములు అర్థం చేసుకోవటం సులభం కాదు. గురుముఖమున అధ్యయనం చేస్తే తప్ప తెలియని విద్యను సరళ సుబోధక భాష్యం రచించటం ద్వారా రచయిత అందరికీ అందుబాటులోకి తీసుకువచ్చారు. ఎంతో ప్రతిభా పాండిత్యములుంటే తప్ప ఇది సాధ్యమయ్యే విషయం కాదు. వ్యాఖ్యాల్యిన వైఖరీ నైపుణ్య విభాసితులైన పార్థసారథి గారు ఇందులో విజయం సాధించారు. వారి లేఖిని నుండి ఇటువంటి ప్రామాణికములైన గ్రంథాలు మరిన్ని రావాలని భావిస్తూ దేవతలు, జగద్గురువులు వారికి శక్తి సంపదలను ప్రసాదించాలని ఆశీర్వదిస్తున్నాను.

నారాయణ స్మరణతో

సిద్ధేశ్వరానంద భారతీ స్వామి

अवधूत दत्त पीठम्

Avadhoota Datta Peetham

## श्री गणपति सच्चिदानन्द आश्रम

## Sri Ganapathy Sachchidananda Ashrama

అవధూత దత్తపీఠాధిపతి

జగద్గురు పరమపూజ్య

## శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద స్వామీజీవారి

## ఆశీస్సందేశము

శ్రీ క్రోవి పార్థసారథిగారు చిరకాలం నుండి దత్తపీఠానికి ఆత్మీయ పండితులు. ఆధ్యాత్మిక గ్రంథరచనలో వారు అందె వేసిన చేయి. బహుగ్రంథకర్తగ లబ్ధప్రతిష్ఠులు. జగమెరిగిన పండితులు. మాకు అత్యంత సన్నిహితులు.

వృత్తిపరంగ కామర్స్‌లో నిష్ణాతులు. రీడరుగ అనేకమంది విద్యార్థులను తయారు చేసిన ఉపాధ్యాయుడు. ప్రవృత్తిపరంగ శ్రీవిద్యాసంప్రదాయములను, వాటిలోని రహస్యాలను గ్రహించి లలితా సహస్రనామాది గ్రంథాలను వ్రాసిన మేధావి. ప్రస్తుతం నివృత్తిమార్గంలో బ్రహ్మసూత్ర భాష్యాదులను ఆస్వాదించిన శాంకరాద్వైతానుయాయి.

వీరు సుమారు 2002 సంవత్సర ప్రాంతంలో బ్రహ్మసూత్రాలను ఆంధ్రీకరించారు. కాని అందులోని భాష, విషయము, సామాన్యులకు కూడ అందుబాటులోనికి తేవాలి! అనే ఉద్దేశ్యంతో తిరిగి వీరే బ్రహ్మసూత్రాలకు వ్యాఖ్యానం చేయడం మాకు చాల సంతోషాన్ని కలిగించింది.

వీరియొక్క వ్యాఖ్యానాన్ని ఆమూలాగ్రం స్థాలీపులాక న్యాయంగ మేము పరిశీలించుట జరిగింది. వీరి రచనావిధానం మాకు చాల ఆనందాన్ని కలిగించింది. సామాన్యులకు కూడ బ్రహ్మసూత్రాలలోని వేదాన్తరహస్యాలను అర్థమయ్యే విధంగ వీరి యొక్క రచన సాగింది.

ఇదేవిధంగ వీరి కలంనుండి ఎన్నో ఆధ్యాత్మిక గ్రంథాలు రావలసిన అవసరం ఎంతో ఉంది. ఆధ్యాత్మిక గ్రంథాలను అందుబాటులోనికి తీసికొని వచ్చుట అనే మహత్తర యజ్ఞానికి మీరు నాంది పలికారు. అగ్నిహోత్రాన్ని ఆరనీయకండి! ఆధ్యాత్మిక గ్రంథాలు అనే సమిధలను నిరంతరం తయారు చేస్తూనే ఉండండి! ఇటువంటి రచనలను మీరు ఇంకా వ్రాయాలని, దానికి కావలిసిన ఆరోగ్యం, బుద్ధిబలం ఆ దత్తాత్రేయుడు మీకు ప్రసాదించాలని ఆశీర్వదిస్తూ....

జయగురుదత్త

మైసూరు

20 అక్టోబరు 2015

మీ

స్వామీజీ

Datta Nagar, Mysore, India-570 025. Tel : (0821) 2486 486 Fax : (0821) 2487 487
e-mail : mail@dattapeetham.com www.dattapeetham.com

# ప్రణతులు

వ్యాసభగవానుడు వేదవిభజన చేసిన తరువాత అష్టాదశ పురాణాలు వ్రాశాడు. ఆ తరువాత బదరికావనానికి వెళ్ళి, పన్నెండు సంవత్సరాలు తపస్సు చేసి, పరబ్రహ్మ సాక్షాత్కారం పొంది పరబ్రహ్మను ప్రతిపాదిస్తూ 'బ్రహ్మసూత్రాలు' వ్రాశాడు. ఇవి మొత్తం నాలుగు అధ్యాయాలుగా, ఒక్కొక్క అధ్యాయము నాలుగు పాదాలుగా, ఒక్కొక్క పాదము కొన్ని అధికరణలుగా ఉంటాయి. ప్రతి అధికరణలోను కొన్ని సూత్రాలు ఉంటాయి. ఈ రకంగా బ్రహ్మసూత్రాలు నాలుగు అధ్యాయాలుగా, పదహారు పాదాలుగా, నూట తొంభై ఒక్క అధికరణలుగా, ఐదువందల యాభై ఐదు సూత్రాలుగా ఉంటాయి. ఇందులో అన్ని మతాలను ఖండించి పరబ్రహ్మ తత్త్వాన్ని ప్రతిపాదించాడు వ్యాసభగవానుడు. బ్రహ్మని గురించి ఆలోచన ఎందుకు చెయ్యాలి? అనే సూత్రంతో ప్రారంభమై, బ్రహ్మలోకానికి చేరిన వారికి పునరావృత్తి (మరుజన్మ) లేదు అంటూ పూర్తవుతుంది ఈ గ్రంథం.

ఈ గ్రంథానికి త్రిమతాచార్యులు వారి భావాలకు అనుగుణంగా భాష్యం వ్రాశారు. తెలుగులో కూడా ఇంతవరకు తొమ్మిది మంది బ్రహ్మసూత్ర భాష్యం వ్రాశారు. అవన్నీ పండితులకే అర్ధమవుతాయి. నేను కూడా 2002 సంవత్సరంలో 'బ్రహ్మసూత్రమంజరి' అనే పేరుతో బ్రహ్మసూత్రాలకు వివరణ వ్రాశాను.

అయితే ఇప్పుడు ఈ పుస్తకాన్ని సామాన్య మానవుడి చేతుల్లోకి తీసుకువెళ్లాలి అనిపించింది. అందుకే అతిసులభశైలిలో, అతిసామాన్యుడికి అర్థం అయ్యేలాగా వ్రాయటానికి ప్రయత్నించాను. ఈ ప్రయత్నంలో నేను విజయం సాధించానని చెప్పవచ్చు.

ఈ పుస్తకాన్ని తమ ఆశ్రమం తరుఫున ముద్రింపచేసిన మాతా కరుణామయికి శతసహస్ర వందనాలర్పిస్తూ, ఈ గ్రంథాన్ని మాతాకరుణామయికే అంకితం చేస్తున్నాను.

గతంలో వ్రాసిన పుస్తకాల లాగానే దీన్ని కూడా ఆదరిస్తారని భావిస్తూ, సవిమర్శలను ఆహ్వానిస్తూ, నా భార్య రమాదేవిని స్మరిస్తూ, పెద్దలందరికీ శిరసు వంచి నమస్కరిస్తూ

మన్మథ నామ సంవత్సర
మార్గశిర బహుళ విదియ
ఆదివారం 27-12-2015

భవదీయుడు
**క్రోవి పార్థసారథి**

# విషయసూచిక

**మొదటి అధ్యాయం - నాల్గవపాదం**



**రెండవ అధ్యాయము-మొదటిపాదం**

## రెండవ అధ్యాయం – రెండవ పాదం



## రెండవ అధ్యాయం – మూడవపాదం

**మూడవ అధ్యాయం - రెండవపాదం**



**మూడవ అధ్యాయం - మూడవపాదం**

**మూడవ అధ్యాయం - నాల్గవ పాదం**

# ప్రణతులు

వ్యాసభగవానుడు వేదవిభజన చేసిన తరువాత అష్టాదశ పురాణాలు వ్రాశాడు. ఆ తరువాత బదరికావనానికి వెళ్ళి, పన్నెండు సంవత్సరాలు తపస్సు చేసి, పరబ్రహ్మ సాక్షాత్కారం పొంది పరబ్రహ్మను ప్రతిపాదిస్తూ 'బ్రహ్మసూత్రాలు' వ్రాశాడు. ఇవి మొత్తం నాలుగు అధ్యాయాలుగా, ఒక్కొక్క అధ్యాయము నాలుగు పాదాలుగా, ఒక్కొక్క పాదము కొన్ని అధికరణలుగా ఉంటాయి. ప్రతి అధికరణలోను కొన్ని సూత్రాలు ఉంటాయి. ఈ రకంగా బ్రహ్మసూత్రాలు నాలుగు అధ్యాయాలుగా, పదహారు పాదాలుగా, నూట తొంభై ఒక్క అధికరణలుగా, ఐదువందల యాభై ఐదు సూత్రాలుగా ఉంటాయి. ఇందులో అన్ని మతాలను ఖండించి పరబ్రహ్మ తత్త్వాన్ని ప్రతిపాదించాడు వ్యాసభగవానుడు. బ్రహ్మని గురించి ఆలోచన ఎందుకు చెయ్యాలి? అనే సూత్రంతో ప్రారంభమై, బ్రహ్మలోకానికి చేరిన వారికి పునరావృత్తి (మరుజన్మ) లేదు అంటూ పూర్తవుతుంది ఈ గ్రంథం.

ఈ గ్రంథానికి త్రిమతాచార్యులు వారి భావాలకు అనుగుణంగా భాష్యం వ్రాశారు. తెలుగులో కూడా ఇంతవరకు తొమ్మిది మంది బ్రహ్మసూత్ర భాష్యం వ్రాశారు. అవన్నీ పండితులకే అర్థమవుతాయి. నేను కూడా 2002 సంవత్సరంలో 'బ్రహ్మసూత్రమంజరి' అనే పేరుతో బ్రహ్మసూత్రాలకు వివరణ వ్రాశాను.

అయితే ఇప్పుడు ఈ పుస్తకాన్ని సామాన్య మానవుడి చేతుల్లోకి తీసుకువెళ్లాలి అనిపించింది. అందుకే అతిసులభశైలిలో, అతిసామాన్యుడికి అర్థం అయ్యేలాగా వ్రాయటానికి ప్రయత్నించాను. ఈ ప్రయత్నంలో నేను విజయం సాధించానని చెప్పవచ్చు.

ఈ పుస్తకాన్ని తమ ఆశ్రమం తరుఫున ముద్రింపచేసిన మాతా కరుణామయికి శతసహస్ర వందనాలర్పిస్తూ, ఈ గ్రంథాన్ని మాతాకరుణామయికే అంకితం చేస్తున్నాను.

గతంలో వ్రాసిన పుస్తకాల లాగానే దీన్ని కూడా ఆదరిస్తారని భావిస్తూ, సవిమర్శలను ఆహ్వానిస్తూ, నా భార్య రమాదేవిని స్మరిస్తూ, పెద్దలందరికీ శిరసు వంచి నమస్కరిస్తూ

మన్మథ నామ సంవత్సర
మార్గశిర బహుళ విదియ
ఆదివారం 27-12-2015

భవదీయుడు
**క్రోవి పార్థసారథి**

# బ్రహ్మసూత్ర భాష్యము

## 1. అజ్ఞానం

మానవుడు అనాదిగా అజ్ఞానం అనే అంధకారంలో పడి దిక్కుతోచక, దారి తెలియక, ఏ విధంగా అజ్ఞానాన్ని వదిలించుకోవాలో తెలియక, అందులోనే పడికొట్టుమిట్టాడుతున్నాడు. ఈ అజ్ఞానంవల్లనే సంసారమనే సాగరంలో పడి మునుగుతూ, తేలుతూ, కుడితితొట్టిలో పడ్డ ఎలుకలాగా, శ్లేష్మంలో పడ్డ ఈగలాగా అందులోంచి బయటకు రాలేక శతమతమవుతున్నాడు. ఈ విషయం గురించి మనం పెద్దగా చెప్పనవసరం లేదు. ఇది అందరికీ తెలిసిందే. మానవుడు అజ్ఞానాన్ని వదిలించుకుని జ్ఞానమార్గంవైపు వెళ్ళాలి. అసలు అజ్ఞానం అంటే ఏమిటి? తెలివి లేకపోవటము, బుద్ధి లేకపోవటం, ఎరుక లేకపోవటం, అవిద్య, మాయ, జ్ఞానం లేకపోవటం దీన్నే అజ్ఞానము అంటారు. తన చుట్టూ ఉన్న విషయాల్లో వస్తువుల్లో ఏది సత్యమైనది? ఏది అసత్యమైనది? ఏది శాశ్వతమైనది? అనే విషయాలు తెలుసుకోలేకపోవటం. దృశ్యమానమైన జగత్తులో కంటికి కనిపించేదంతా శాశ్వతం కాదు. కంటికి కనిపించేదంతా నశించేదే. పుట్టటము, పెరగటము, వృద్ధిచెందటము. క్షీణించటము, నశించటము అనేవి జగత్తులోని వస్తువుల, జీవుల లక్షణాలు. నామరూపాలు కలిగినవన్నీ నశిస్తాయి. ఈ విషయం తెలుసుకోలేక మానవుడు ఈ జగత్తంతా శాశ్వతము అనుకుంటాడు. తన ముత్తాతలు, తాతలు, తండ్రులు అందరూ మరణించారు. రేపోమాపో తాను కూడా మరణిస్తాడు. అయినప్పటికి అది నిజమని నమ్మడు. ఇప్పటివరకు ఈ ధరామండలాన్ని అనేకమంది చక్రవర్తులు, రాజులు, మహారాజులు (బలిచక్రవర్తి, శిబిచక్రవర్తి లాంటివారు అనేకమంది) పాలించారు.

వారంతా కాలగర్భంలో కలిసిపోయారు. వారిలో ఏ ఒక్కరూ లేరు. కొంతమంది మహానుభావుల పేర్లు మాత్రం గుర్తున్నాయి. కాని మిగిలిన వారికి అది కూడా లేదు. మానవుడికి ఈ విషయాలన్నీ తెలుసు. రేపోమాపో తాను కూడా మరణిస్తాననే మాటకూడా తెలుసు. అయినప్పటికీ జీవితం మీద అత్యంతమైన ప్రేమ. సిరిసంపదల మీద ఆశ, లోకంలో ఉన్నదంతా తనకే కావాలి; తనకే చెందాలి అనే కోరిక. ఈ దేహం పాంచభౌతికమైంది. మహా అయితే వంద సంవత్సరాలు ఉంటుంది. తరువాత మట్టిలో కలిసిపోతుంది. మానవుడికి ఈ విషయం కూడా తెలుసు. అయినా దేహం మీద విపరీతమైన మమకారం. నేను అంటే దేహమే అనే భ్రాంతి. ఇదే అజ్ఞానము, మాయ, అవిద్య అంటూ రకరకాల పేర్లతో పిలువబడుతోంది. దీనికి కారణం మానవుడు తనను తాను తెలుసుకోకపోవటం.

గాలి బుడగ జీవితం. ఇది క్షణభంగురం. ఇక యవ్వనం అందామా? దాన్ని గురించి చెప్పనవసరం లేదు. చూడటానికి చాలా అందంగా కనిపిస్తుంది ఈ దేహం. కాని మలమూత్రాలు, రక్తమాంసాలు, ఎముకలు, నరాలు వీటన్నింటితో కూడినది, పంచభూతాలతో ఆవరించబడినది ఈ దేహము. ఇందులోంచి ఏ పదార్థం బయటకు వచ్చినా సహించలేము. అసహ్యకరంగా ఉంటుంది. ఇటువంటి శరీరాన్ని అందమైనదిగా భావన చేస్తాడు చాలా జాగ్రత్తగా పోషిస్తాడు. అశాశ్వతమైన దాన్ని శాశ్వతము అనుకుని దానిమీద అత్యంతమైన శ్రద్ధ తీసుకుంటాడు. అజ్ఞానం ఎందుకు వస్తుంది? దీనికి రెండు కారణాలు 1. అగ్రాహ్యము 2. అన్యధాగ్రాహ్యము. ఏదైనా ఒక వస్తువును చూసినప్పుడు దాని అసలు స్వరూపాన్ని గ్రహించలేకపోవటాన్నే అగ్రాహ్యము అంటారు. ఉదాహరణకు మసకచీకట్లో చూసిన త్రాడును, త్రాడు అని గుర్తించలేకపోవటం. ఆ వస్తువును ఇంకొకటిగా భావించటాన్నే అన్యధా గ్రాహ్యము అంటారు. ఇందాక మసక చీకట్లో త్రాడును చూశాడు దాన్ని త్రాడు అనుకోలేదు. దీనివల్ల ఇబ్బంది లేదు. త్రాడును చూసి పాము అనుకున్నాడు. భయంతో కేకలు వేశాడు. ఇక్కడ చూడండి త్రాడను చూసి అది త్రాడు అని గ్రహించకపోవటం అగ్రాహ్యం. అది పాము అనుకోవటం అన్యధా గ్రాహ్యము. ఇలా భావన చేస్తాడు. అందుకే భయపడి కేకలు వేశాడు. త్రాడును చూసి పాము అనుకున్నాడు అంతేకాని

ఎప్పుడూ పామును చూసి ఇది త్రాడు అనుకోడు. అలాగే సముద్రంలో తేలుతున్న ముత్యపు చిప్పను చూసి వెండిపాత్ర అనుకుంటాడు. స్థాణువును చూసి దొంగవాడనుకుంటాడు.

ఇక్కడ జరిగిందేమంటే ఒక వస్తువు లక్షణాలు ఇంకొక దానిలో ఆరోపించటం. దీన్నే వేదాంత పరిభాషలో **'అధ్యాసము'** అంటారు. ఒక చోట చూసిన దాన్ని ఇంకో చోట స్మరించటం. ఒక దాని లక్షణాలు, ధర్మాలు వేరొక దానిమీద ఆరోపించటం, వస్తువుల మధ్య తేడా గమనించకపోవటం. ఈ అధ్యాసనే పండితులు అవిద్య, అజ్ఞానము అంటున్నారు. ఈ అజ్ఞానం కారణంగానే మానవుడు నేను అంటే దేహము, దేహమే ఆత్మ అనుకుంటున్నాడు. దేహం నశిస్తుంది. ఆత్మకు నాశనం లేదు. దేహానికి కాళ్ళు, చేతులవంటి వివిధ అవయవాలున్నాయి. కాని ఆత్మకు ఆకారం లేదు. అది నిరాకారము. దేహం అశాశ్వతము. ఆత్మ శాశ్వతమైనది. నాశనము లేనిది.

మనం చెప్పే ప్రమాణాలు కాని, శాస్త్రాలు గాని, సూత్రాలు గాని ఇవన్నీ అవిద్యతో కూడిన దేహానికే. అవిద్య లేనివాడికి, జ్ఞానికి వీటితో పనిలేదు. అజ్ఞానంతో కూడిన మానవుడికీ, పశువుకీ తేడా లేదు. ఏదైనా పెడతాము (ఇస్తాము) అంటే దగ్గర కొస్తారు. కొడతాం అంటే పారిపోతారు. వేదాలలోను, శాస్త్రాలలోను చెప్పిన కర్మలు, యజ్ఞయాగాది క్రతువులు ఇవన్నీ అజ్ఞానులే చేస్తారు. జ్ఞానులకు వీటితో పనిలేదు. ఆత్మకు కులమతాలు, పాపపుణ్యాలు, కష్టసుఖాలు, ఏవీ ఉండవు. మానవుడు తానుచేసే పనులన్నింటికీ తానే కర్తని, ఫలభోక్తని అనుకుంటున్నాడు. ఇది అధ్యాస. దీన్ని పోగొట్టి జగత్తులో ఉన్నది ఆత్మ ఒక్కటే. అదే సత్యము, నిత్యము, శాశ్వతము అని చాటి చెబుతున్నాయి వేదాంత గ్రంథాలు. ఈ వరుసలో ముందు చెప్పబడేవే బ్రహ్మసూత్రాలు. ఇతర మతాల, వాదనలు ఖండిస్తూ పరబ్రహ్మతత్త్వాన్ని ప్రతిపాదించటానికి వ్యాసమహర్షి చేసిన ప్రయత్నమిది.

బ్రహ్మసూత్రాలు మొత్తం నాలుగు అధ్యాయాలుగా ఉంటుంది. ప్రతి అధ్యాయం లోను నాలుగు పాదాలు, ప్రతిపాదంలోను కొన్ని అధికరణలు. ప్రతి అధికరణలోను కొన్ని సూత్రాలు ఉంటాయి.

| అధ్యాయము | పాదము | అధికరణలు | సూత్రాలు |
|---|---|---|---|
| 1 | 1 | 11 | 31 |
| | 2 | 7 | 32 |
| | 3 | 13 | 43 |
| | 4 | 8 | 28 |
| | | 39 | 134 |
| 2 | 1 | 13 | 37 |
| | 2 | 8 | 45 |
| | 3 | 17 | 53 |
| | 4 | 9 | 22 |
| | | 47 | 157 |
| 3 | 1 | 6 | 27 |
| | 2 | 8 | 41 |
| | 3 | 36 | 66 |
| | 4 | 17 | 52 |
| | | 67 | 186 |
| 4 | 1 | 14 | 19 |
| | 2 | 11 | 21 |
| | 3 | 6 | 16 |
| | 4 | 7 | 22 |
| | | 38 | 78 |
| | మొత్తం | 191 | 555 |

ఈ రకంగా బ్రహ్మసూత్రాలు నాలుగు అధ్యాయాలుగా, పదహారు పాదాలుగా, నూట తొంభై ఒక్క అధికరణలుగా ఐదు వందల యాభై ఐదు సూత్రాలుగా ఉన్నాయి. ముందుగా బ్రహ్మసూత్రాలు వ్రాసిన వ్యాసమహర్షికి నమస్కరించి, వాటికి భాష్యం వ్రాసిన ఆదిశంకరులకు ప్రణమిల్లి, నా గురుదేవులైన విరజానందనాథ, సదానందనాథ, సుకానందనాథులకు, సాష్టాంగదండ ప్రణామాలాచరించి, ధర్మ సంస్థాపన కోసం ఏర్పాటయిన శృంగేరీ, బదరీ, పూరి, ద్వారక పీఠాధిపతులకు నమస్కరించి, అవధూత దత్తపీఠాధిపతులు గణపతి సచ్చిదానందస్వామి వారికి, పెంచలకోన మణిద్వీప మహాసంస్థానాధిపతి మాతా విజయేశ్వరీ దేవికి, దేశంలోని ఇతర పీఠాధిపతులకు, మతాధిపతులకు, ఆధ్యాత్మికవేత్తలకు వందనాలర్పించి బ్రహ్మసూత్రాలు సామాన్యుడికి చేరువ కావాలనే ఉద్దేశ్యంతో **'బ్రహ్మసూత్రభాష్యం'** మళ్ళీ వ్రాస్తున్నాను. గతంలో 2002 సంవత్సరంలో నేను 'బ్రహ్మసూత్రాలు' అనే పేరుతో భాష్యం వ్రాశాను. అప్పుడు 555 సూత్రాలకు వివరణ వ్రాశాను. కాని ఇప్పుడు వీటిని సామాన్యుడికి అర్థమయ్యే రీతిలో వ్రాయటానికి ఉపక్రమిస్తున్నాను. నా యీ ప్రయత్నాన్ని మన్నించి నన్ను ఆశీర్వదిస్తారని ఆకాంక్షిస్తూ గ్రంథాన్ని ప్రారంభిస్తున్నాను. బ్రహ్మసూత్రాలు నాలుగు అధ్యాయాలుగా, ఒక్కొక్క అధ్యాయము నాలుగు పాదాలు (భాగాలు)గా ఉంటుంది. అంత వరకు తెలుస్తోంది. ప్రతిపాదంలోను కొన్ని అధికరణలు ఉంటాయి. అసలు అధికరణ అంటే ఏమిటి?

అధికరణ అంటే గ్రంథభాగము. అయితే కేవలము గ్రంథంలోని ఒక భాగాన్ని అధికరణ అనటానికి వీలులేదు. దానికి కొన్ని లక్షణాలున్నాయి.

**విషయో విశయశ్చైవ పూర్వపక్షస్తథోత్తరమ్ ।**
**ప్రయోజనం సంగతిశ్చ ప్రాంచోధికరణం విదుః ॥**

విషయము, విశయము, పూర్వపక్షము, ప్రయోజనము, సంగతి వీటినే అధికరణ పంచకము అంటారు.

| | | |
|---|---|---|
| విషయము | – | విచారణ చేయదగినది |
| విశయము | – | దానిలో కలిగే సంశయము |
| పూర్వపక్షము | – | కాదని ఖండించుట |
| ప్రయోజనము | – | అవునని నిర్ధారణ చేయుట |
| సంగతి | – | పరస్పరానుకూల్యము చూచుట |

ఈ లక్షణాలుంటేనే అది **'అధికరణ'** అనబడుతుంది.

**విషయః సందేహః సంగతిః పూర్వపక్షః సిద్ధాన్త ।**
**ఇత్యేకైక మధికరణం పంచావయవం జ్ఞేయం ॥**

విషయము, సందేహము (సంశయము), సంగతి, పూర్వపక్షము, సిద్ధాంతము అనేవి అధికరణకు ఐదు అవయవముల వంటివి.

ఏదైనా ఒక విషయాన్ని గురించి చెప్పేటప్పుడు ఇతర గ్రంథాలలో దాన్ని గురించి ఏం చెప్పారు? దానిమీద మనకున్న సందేహాలు ఏవి? వాటికి సమాధానాలు ఏవి? దానిమీద వాద ప్రతివాదనలు; విషయాన్ని అవును అని నిర్ధారణ చెయ్యటము. అలా తీర్మానించటానికి సిద్ధాంతము. ఈ విషయాలను దృష్టిలో పెట్టుకుని చేసే గ్రంథభాగమే అధికరణము.

మరి **'సూత్రము'** అంటే

**అల్పాక్షరమసందిగ్ధం సారవద్విశ్వతో ముఖం ।**
**అస్తోభమనవద్యంచ సూత్రం సూత్రవిదో విదుః ॥**

కొద్ది అక్షరాలు మాత్రమే కలిగి ఉండి, అనుమానానికి తావు లేకుండా అర్థాన్ని వివరిస్తూ, ఆకారంలో చిన్నదై ఏవిధమైన దోషము లేని వాక్యాన్ని సూత్రము అంటారు. సూత్రము అంటే దారము అనికూడా అర్థం. పూలన్నీ కలిపి మాలగా గ్రుచ్చటానికి ఉపయోగపడేది. దండ గ్రుచ్చిన తరువాత దానికి ఉపయోగించిన దారం కనిపించదు. కేవలము పూలు మాత్రమే కనిపిస్తాయి. అలాగే సృష్టిలో మనకు కనిపించే 84 లక్షల జీవరాసి, పర్వతాలు, లోయలు, ఎడారులు, చెట్లుచేమలు, నదీనదాలు, అడవులు, కొండలు ప్రాణమున్నవి, ప్రాణంలేనివి అన్నీ ఒకే సూత్రంతో బంధించబడి ఉన్నాయి. ఇలా జగత్తునంతటినీ ఒకే సూత్రంతో కలిపి ఉంచగలిగినది 'ఆత్మ' అనే సూత్రం ఒక్కటే. ఈ విషయం వివరించటానికే బ్రహ్మసూత్రాలు వ్రాశాడు వ్యాసమహర్షి. బ్రహ్మసూత్రాలు పండితులకే కాదు. సామాన్యుడికి కూడా అర్థం కావాలనే దృష్టితోనే, అతితేలిక అయిన భాషలో **బ్రహ్మసూత్ర భాష్యం** వ్రాస్తున్నాను.

# ౨. వ్యాసమహర్షి

**వ్యాసంవసిష్టనప్తారం శక్తేః పౌత్రమకల్మషం**
**పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిం ।**
**వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే**
**నమో వై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమో నమః ॥**

వేదాలు అపౌరుషేయాలు. అవి ఎవరిచేత వ్రాయబడలేదు. ప్రత్యక్షంగా బ్రహ్మముఖం నుండే వచ్చినాయి. ఇక్కడ బ్రహ్మ అంటే పరమేశ్వరుడు. సృష్టి, స్థితి లయ కారకుడు. ఆది మధ్యాంతరహితుడు. పరమేశ్వరుడు ఈ వేదాలను సృష్టికారకుడైన ప్రజాపతికి ఇచ్చాడు. కాలక్రమేణా ఈ వేదాలు గురుపరంపరగా భూలోకంలో వ్యాప్తి చెందాయి.

త్రేతాయుగం వరకు ఈ వేదం అంతా ఒకటిగానే ఉండేది. ఆ తరువాత కాలంలో అంటే ద్వాపరయుగంలో కలగాపులగంగా ఉన్న ఈ వేదాన్ని అర్థం చేసుకోవటం కష్టమైంది. అందుచేత ప్రజాపతి, అపాంతరతముడు అనే మానసపుత్రుణ్ణి సృష్టించి, వేదాన్ని భూలోకంలో బాగా ప్రచారం చేసి రమ్మన్నాడు. అపాంతరతముడు ఋగ్, యజు, స్సామ, అధర్వణములు అని వేదాన్ని నాలుగు భాగాలుగా చేసి బహుళ ప్రచారంలోకి తెచ్చి, తన తండ్రియైన బ్రహ్మదగ్గరకు వెళ్ళి ఈ విషయం చెప్పాడు. దానికి బ్రహ్మ చాలా సంతోషించి ప్రతి మహాయుగంలోని ద్వాపరయుగంలోనూ వేదాలను ఈ రకంగానే విభజన చేసి ప్రచారం చెయ్యవలసినదిగా అపాంతరతముణ్ణి ఆదేశించాడు.

నాలుగు యుగాలు కలిస్తే ఒక మహాయుగం. అందులోని ద్వాపరయుగంలో ఈ వేదాలు బ్రహ్మయొక్క ఆదేశానుసారము విభజన చేయబడుతుంటాయి.

ఇది ఇరవై ఎనిమిదవ మహాయుగము. అంటే ఇప్పటికి ఇరవై ఎనిమిది సార్లు వేదాలను విభజించటం జరిగింది. వేదాలను విభజించినటువంటి వాడు వేదవ్యాసుడు అనబడతాడు. ఈ మహాయుగంలో వేదాలను విభజించినవాడు కృష్ణద్వైపాయనుడు అతడే మనకు తెలిసిన వేదవ్యాసుడు.

పరాశరమహర్షి తీర్థయాత్రలు చేస్తూ కాళిందీ నదీతీరాన్ని చేరి, ఆ నదిని దాటించమని దాశరాజును అడిగాడు. ఆ సమయంలో దాశరాజు భోజనం

చేస్తున్నాడు. అందుచేత, తన ప్రక్కనే ఉన్న తన కుమార్తెను ఆ పని చెయ్యమన్నాడు. దాశరాజు కుమార్తె మత్స్యగంధి పడవలో మహర్షిని ఎక్కించుకుని బయలుదేరింది. పడవ నది మధ్యకి చేరింది. దైవికంగా మహర్షి మనస్సు మత్స్యగంధి మీదకు పోయింది. ఆపుకోలేని తమకంతో మహర్షి ఆమె చెయ్యి పట్టుకున్నాడు. అప్పుడు మత్స్యగంధి "స్వామీ! నేను దుర్వాసన వేస్తున్నాను కదా. మీకు అసహ్యాం కలగటం లేదా?" అన్నది. ఆ మాట విన్న వెంటనే మహర్షి, ఆమె ఉన్న చోటునుంచి యోజనదూరం కస్తూరి వాసనలు వెదజల్లేటట్లుగా వరమిచ్చాడు. అప్పటినుంచే మత్స్యగంధి కాస్తా 'యోజనగంధి' అయింది. అప్పుడు ఆమె "స్వామీ ! ఇది పగలు. లోకమంతా చూస్తుంది. అదీగాక, దివాసంగమం నిషిద్ధం కదా?" అన్నది. మహర్షి తన తపశ్శక్తితో ఆ ప్రాంతమంతా చిమ్మచీకట్లు ఆవరింపచేశాడు. అప్పుడు ఆమె "నేను కన్యను. నీ పని నువు చేసుకుపోతావు. మరి నా సంగతి ఏమిటి?" అంది. ఆమె కన్యాత్వము చెడకుండా వరమిచ్చాడు మహర్షి. ఈ రకంగా తన కన్యాత్వము చెడకుండ, తండ్రికి తెలియకుండ, తనకు నిత్యయవ్వనము, నిత్యసుగంధము ఉండేటట్లు, పరాశరునితోపాటు సమానమైన కుమారుడు కలిగేటట్లు వరాలు పుచ్చుకుని మహర్షి కోర్కె తీర్చింది. మహర్షి సంతుష్టిచెంది "నీకు విష్ణ్వాంశ సంభూతుడు, ముల్లోకాలలోను ఖ్యాతిని ఆర్జించేవాడు, వేదవిభజన చేసేవాడు, పురాణకర్త అయిన కుమారుడు పుడతాడు" అని ఆమెను దీవించి తనదారిన తాను వెళ్ళిపోయాడు.

యోజనగంధి సద్యోగర్భాన ఒక కుమారుణ్ణి కన్నది. అతడు పుడుతూనే మునివేషంలో దండకమండలాలు ధరించి ఉన్నాడు. పుట్టిన వెంటనే తల్లికి నమస్కరించి, అవసరమైనప్పుడు స్మరణమాత్రం చేతనే ప్రత్యక్షమవుతాను అని తల్లికి మాట ఇచ్చి, తపస్సు చేసుకోవటానికి వెళ్ళిపోయాడు. ఈ విధంగా కృష్ణద్వీపమున (చీకటిగా ఉన్న ద్వీపమునందు) జన్మించినవాడు కావటంచేత ఆ బాలకుడు కృష్ణద్వైపాయనుడైనాడు. వేదవిభజన చేసి వేదవ్యాసుడు అయినాడు. ఈయనే వ్యాసమహర్షి. ఋషులలో అనేక భేదాలున్నాయి. 1. మహర్షులు – వ్యాసుడు మొ॥వారు 2. పరమఋషులు – ఖేలాదులు. 3. దేవర్షులు – నారదుడు, కణ్వుడు మొ॥వారు 4. బ్రహ్మర్షులు–వసిష్టాదులు 5. శ్రుతర్షులు – శుశ్రుతాదులు 6.రాజర్షులు – విశ్వామిత్రాదులు 7. కాండర్షులు – జైమిన్యాదులు. ఈ ఋషులందరిలోను వ్యాసుడు ప్రముఖుడు.

ఈ రకంగా వ్యాసుడు వేదాలను విభజించిన తరువాత బ్రహ్మవిద్యపై దృష్టి సారించాడు. అంటే తనను గురించి తాను తెలుసుకోవాలి అనుకున్నాడు. దాన్ని గురించి తీవ్రంగా ఆలోచన చేశాడు. అదే తపస్సు. అప్పుడు **"బ్రహ్మసత్యం - జగన్మిథ్య"** అనే విషయం ఆయనకు తట్టింది. ఈ రకంగా పరమేశ్వరుణ్ణి గురించి తీవ్రంగా ఆలోచించి, తాను దర్శించిన పరమార్థాన్ని చిన్నచిన్న సూత్రాలుగా క్రమబద్ధీకరించాడు. అవే "బ్రహ్మసూత్రాలు".

పరబ్రహ్మ తత్త్వాన్ని నిరూపించటమే ఈ సూత్రాల ప్రధాన ధ్యేయం. చరాచర జగత్తు అంతా బ్రహ్మపదార్థంతోనే సృష్టించబడింది. జగత్తంతా పరమేశ్వరమయమే. మానవుడు ఎక్కడ నుంచి వచ్చాడు? మరణానంతరము మళ్ళీ ఎక్కడికి పోతాడు? పునర్జన్మ ఎందుకు ఎత్తాలి? మోక్షం అంటే ఏమిటి? ఇత్యాది ప్రశ్నలకు సమాధానం చెప్పగలిగింది ఒక్క బ్రహ్మవిద్య మాత్రమే. 'బృంహణం' అంటే అంతటా నిండి ఉండటము అని అర్థం. బృంహణశక్తి గలది బ్రహ్మము. ఇది విశాల విశ్వమంతా వ్యాపించి ఉన్నది. జీవాత్మ, పరమాత్మ వేరు కాదు. రెండూ ఒక్కటే.

వ్యాసుడు బ్రహ్మపదార్థాన్ని తరచి చూసి, దాన్ని సూత్రబద్ధం చేశాడు. అవే బ్రహ్మసూత్రాలు. బ్రహ్మసూత్రాలు వ్రాయటానికి ముందు వ్యాసుడు చార్వాక, నాస్తిక, లోకాయుత, నిరీశ్వరవాదాలన్నీ పూర్తిగా అధ్యయనం చేశాడు. ఆ తరువాత తార్కికబుద్ధితో బాగా ఆలోచించి జగత్తులో కనిపించేది, కనిపించనిది అంతా బ్రహ్మపదార్థమే. అని తేల్చాడు.

**సర్వవేదాంత తాత్పర్య నిర్ణయాయ మహామునిః**
**చకార బ్రహ్మసూత్రాణి భగవాన్ బాదరాయణః**
**చత్వారస్త్రత్రచాధ్యాయాః ప్రత్యేకం తే చతుష్పదాః**
**సూత్రాణాం పంచ పంచాశ దుత్తరం శత పంచకం**
**వేదాంతస్థాధికరణం ద్వినవత్యుత్తరం శతం**
**ఏతచ్ఛారీరకం శాస్త్రం కృష్ణద్వైపాయనో గురుః**
**పుత్రమధ్యాపయామాస శిష్యంచ శుక మాదరాత్**

వ్యాసమహర్షి ఉపనిషత్సారము అంతా బ్రహ్మసూత్రాలలో నింపాడు. ఇది మొత్తం నాలుగు అధ్యాయాలు. ప్రతి అధ్యాయానికి నాలుగు పాదాలుంటాయి. ప్రతిపాదంలోనూ కొన్ని అధికరణలు ఉంటాయి. మొత్తంమీద ఈ గ్రంథంలో 555 సూత్రాలు, 191 అధికరణలు ఉంటాయి. ఈ బ్రహ్మసూత్రాలను వ్యాసుడు అతి ఆదరముతో తన కుమారుడు, శిష్యుడు కూడా అయిన శుకమహర్షికి ఉపదేశించాడు.

వ్యాసుడు బ్రహ్మసూత్రాలు వ్రాశాడు. ఎలా వ్రాశాడు? వేదవిభజన చేసిన తరువాత బ్రహ్మసూత్రాలు వ్రాయాలి అనుకున్నాడు. దానికి ముందుగా పరబ్రహ్మ సాక్షాత్కారం కావాలి. అందుకే బదరికావనానికి వెళ్ళి పన్నెండు సంవత్సరాలు తపస్సు చేసి పరబ్రహ్మను సాక్షాత్కరింప చేసుకుని, ఆ తరువాత బ్రహ్మసూత్రాలు వ్రాశాడు. వీటిని ప్రారంభించే ముందు మన దేశంలో ఉన్న వివిధ మతాలు, వాటి యొక్క తత్త్వము, అని ఏం చెబుతున్నాయి? ఇత్యాది విషయాలు క్షుణ్ణంగా పరిశీలించాడు. ఆ తరువాత బ్రహ్మసూత్రాలు వ్రాశాడు. బ్రహ్మసూత్రాల సారం ఏమిటంటే – **చరాచర జగత్తంతా పరమేశ్వర స్వరూపమే. అదే ఆత్మ. ఈ జగత్తులో దృశ్యమానమైనదంతా నశించిపోయేదే. సత్యము, నిత్యము, శాశ్వతము అయినది పరబ్రహ్మ ఒక్కటే.**

***బ్రహ్మసత్యం - జగన్మిధ్య.***

## 3. శంకర భగవత్పాదులు

**శ్రుతిస్మృతి పురాణానామాలయం కరుణాలయం ।**
**నమామిభగవత్పాదం శంకరం లోకశంకరం ॥**

**శంకరం శంకరాచార్యం కేశవం బాదరాయణం ।**
**సూత్రభాష్యకృతౌ వందే భగవన్తం పునః పునః ॥**

కేరళ దేశంలో పూర్ణానదీ తీరంలో **'కాలడి'** అనే గ్రామం ఉంది. ఆ గ్రామంలో ఆర్యాంబ, శివగురువు అనే నంబూద్రిబ్రాహ్మణదంపతులుండేవారు. వారికి చాలా రోజులదాకా సంతానం కలగలేదు. అప్పుడు వారు **'త్రిచూరు'**లోని వృషాచలేశ్వరుణ్ణి ఆరాధించగా ఆ స్వామిదయ వల్ల వారికి ఒక కుమారుడు కలిగాడు. ఆ పిల్లవాడికి 'శంకరుడు' అని నామకరణం చేసి అల్లారుముద్దుగా పెంచసాగారు. శంకరుడికి మూడుసం॥లు వయసు వచ్చేసరికి అతని తండ్రి శివగురువు పరమపదించాడు.

అప్పటి నుంచి అతని తల్లి 'ఆర్యాంబ'యే కుమారుణ్ణి పెంచి ఐదవ ఏట ఉపనయనం చేసింది. ఆర్యాంబ తన ఇంటివద్ద ఉన్న ఆలయంలో నిత్యం కాత్యాయనీ దేవిని అర్చిస్తూఉండేది. ఒకరోజు తనకు ఆలయానికి వెళ్ళటానికి వీలుపడక బాలశంకరుణ్ణి పంపింది. ఆ బాలుడు దేవినైవేద్యానికి పాలు తీసుకువెళ్ళాడు. ఆలయంలో దేవిని అర్చించి, శంకరుడు దేవికి నైవేద్యంగా పాలు సమర్పించాడు. ఎంతకీ దేవి పాలుత్రాగలేదు. అది చూసి శంకరుడు గుక్కపెట్టి ఏడవటం మొదలుపెట్టాడు. శంకరుడి అవస్థ చూసి ఆ దేవి గిన్నెలోని పాలను త్రాగి వెళ్ళింది. కళ్ళు తెరిచి చూశాడు శంకరుడు. గిన్నె ఖాళీగా కనపడింది. శంకరుడు మళ్ళీ ఏడవటం మొదలుపెట్టాడు. బాలుడు ఎందుకు ఏడుస్తున్నాడో దేవికి అర్థం కాలేదు. అప్పుడు దేవి ప్రత్యక్షమై అతని ఏడుపుకు కారణం అడిగింది. 'నీకు నైవేద్యం పెట్టిన తరువాత మా అమ్మ గిన్నెలో పాలను నాకు ఇచ్చేది. ఇప్పుడు పాలన్నీ నువ్వే తాగేశావు. నాకు ఆకలివేస్తోంది. నేనేం త్రాగాలి ?' అన్నాడు శంకరుడు. దానికి ఆ దేవి చలించి శంకరుడికి స్తన్యం ఇచ్చింది. ఆ విధంగా దేవిస్తన్యం గ్రోలినందువల్లనే శంకరుడు అంత గొప్పవాడయినాడు అని ప్రతీతి.

శంకరుడు జన్మించటానికి ముందు భారతదేశంలో వేదవిరుద్ధమైన మతాలు బాగా వ్యాప్తిలో ఉన్నాయి. శైవ, వైష్ణవమతాలు చెలరేగి ప్రజలను అశాంతిపాలు చేస్తున్నాయి. వర్ణాశ్రమ వ్యవస్థ తారుమారయింది. బౌద్ధ, జైనమతాలు అహింసను మాత్రం ప్రచారం చేస్తున్నాయి. యజ్ఞయాగాదులను నిరసిస్తున్నాయి. కాపాలికులు భైరవోపాసకులై నరబలులు ఇస్తున్నారు. నాస్తికులు దేవుడులేడు, వేదము ప్రమాణము కాదు అన్నవాదనను లేవదీశారు. శివుడు గొప్పవాడని కొందరు, విష్ణువు గొప్పవాడని కొందరు యుద్ధాలు చేస్తున్నారు. ప్రజలు నిత్యం భయభ్రాంతులై బతుకును ఈడుస్తున్నారు.

అటువంటి సమయంలో కుమారస్వామి ఈ లోకంలో 'కుమారిలభట్టు' అనే పేరుతో అవతరించి అవైదికచర్యలను ఖండిస్తున్నాడు. ఇటువంటి సమయంలో శంకరుడు ఉద్భవించాడు. తల్లి విద్యాభ్యాసం కోసం శంకరుణ్ణి గురుకులంలో చేర్పించింది. మధుకర వృత్తి చేస్తూ శంకరుడు విద్యాభ్యాసం సాగిస్తున్నాడు. 'మధుకరము' అంటే తుమ్మెద అని అర్థం. తుమ్మెద పూవులన్నింటి మీద వాలి, వాటిలోని మధువును త్రాగుతుంటుంది. అలాగే విద్యార్థియైన బ్రహ్మచారి తనకు కావలసిన ఆహారాన్ని పదిళ్ళల్లో భిక్షగా తెచ్చుకోవటం ఆ రోజుల్లో సంప్రదాయం. ఆ సంప్రదాయం ప్రకారమే శంకరుడు కూడా మధుకర వృత్తిచేస్తూ విద్యాభ్యాసం చేయసాగాడు. ఒకరోజున ఒక ఇంటికి వెళ్ళి 'భవతి ! భిక్షాందేహి' అన్నాడు. ఆ ఇంటి ఇల్లాలు తాము కడుపేదవారమని, తన భర్తకూడా బిక్షాటనకే వెళ్ళాడని చెప్పింది. అప్పుడు శంకరుడు 'ఇంట్లో ఏది ఉంటే అది వెయ్యమని' అడిగాడు. ఆ ఇల్లాలు ఇల్లంతా వెతకగా ఒక పండిపోయిన ఉసిరికాయ కనిపించింది. దాన్నే ఆమె శంకరుడికి భిక్షగా వేసింది. అది చూసి చలించిన బాలశంకరుడు.

**వందే వందారు మందార మింది రానందకందలమ్**

**అమందానంద సందోహబంధురం సింధురాననమ్ ॥**

**అంగంహరేపులకభూషణ మాశ్రయంతీ**

**భృంగాంగనేవ ముకుళాభరణం తమాలం ॥**

**అంగీకృతాఖిల విభూతిరపాంగలీలా**

**మాంగల్యదాऽస్తు తమ మమంగళ దేవతాయాః ॥**

శ్రుత్యై నమోస్తు శుభకర్మ ఫలప్రశూత్యై
రత్యై నమోస్తు రమణీయ గుణార్ణవాయై
శక్త్యై నమోస్తు శతపత్రనికేతనాయై
పుష్ట్యై నమోస్తు పురుషోత్తమ వల్లభాయై ॥

నమోస్తు నాళీక నిభాననాయై
నమోస్తు దుగ్ధోదధి జన్మ భూమ్యై
నమోస్తు సోమామృత సోదరాయై
నమోస్తు నారాయణ వల్లభాయై ॥

అంటూ 21 శ్లోకాలతో లక్ష్మీదేవిని ప్రార్థన చేస్తే వారి ఇంటి ముంగిట బంగారు ఉసిరికాయల వర్షం కురిసింది. అప్పుడు శంకరుడు లక్ష్మీదేవిని చేసిన స్తోత్రమే **'కనకధారాస్తవము'**గా ప్రఖ్యాతి చెందింది.

ఏకసంధాగ్రాహి అయిన శంకరుడు కేవలం రెండుసంవత్సరాలలోనే విద్యాభ్యాసం పూర్తి చేశాడు. శంకరుడి కీర్తి ప్రతిష్ఠలు దశదిశలా వ్యాపించసాగాయి. కేరళరాజ్యాధిపతి శంకరుడికి సాష్టాంగ ప్రణామాలాచరించి కానుకలందించగా శంకరుడు వాటిని పేదలకు పంచి, రాజును ఆశీర్వదించాడు. క్రాంగనూరులో ఉన్న ఆలయంలో దేవి ఉగ్రమూర్తిగా ఉన్నది అని విని, తన తపశ్శక్తితో ఆమెను ప్రసన్నమూర్తిగా మార్చాడు.

ఒకనాడు గౌతముడు మొదలైన మహర్షులు శంకరుని ఆశ్రమానికి వచ్చి, అతని ఆతిథ్యం అందుకుని, అతను చేయవలసిన మహత్కార్యం గురించి గుర్తు చేశారు. అప్పుడు శంకరుడు తాను నిర్వహించవలసిన మహత్కార్యానికి ముందు గృహత్యాగంచేసి సన్యాసంస్వీకరించాలి అని సంకల్పించాడు.

ఒకరోజున శంకరుడు తల్లితో కలిసి నదీ స్నానానికి వెళ్ళాడు. అక్కడ ఒక మొసలి అతని కాలుపట్టుకుంది. అప్పుడు శంకరుడు తాను ఇంక బ్రతకననీ, సన్యసించటానికి అనుజ్ఞ ఇమ్మనీ వేడుకోగా, తల్లి దుఃఖిస్తూనే సరేనంది. శంకరుడు ఆతురసన్యాసం స్వీకరించాడు. శంకరుడు సన్యసించటానికి తల్లిఒప్పుకోగానే

విచిత్రంగా ఆ మొసలి శంకరుడికాలు వదలిపెట్టి వెళ్ళిపోయింది. శంకరుడు నర్మదానదీతీరానికి వెళ్ళి, అక్కడ గోవిందపాదాచార్యులవారి దగ్గర సంప్రదాయ బద్ధంగా సన్యాసం స్వీకరించాడు.

ఒకరోజు నర్మదానదికి వరదవచ్చి ఊరును ముంచేస్తోంది. ప్రజలు భయాందోళనలతో ఉన్నారు. అప్పుడు శంకరుడు నర్మదానదీప్రవాహాన్ని తన కమండలంలోకి ఆవాహనచేసి ప్రజలను రక్షించాడు. అది చూసిన గోవింద భగవత్పాదులవారు అమితానందం పొందారు. గతంలో ఒకసారి వ్యాసమహర్షి గోవిందపాదాచార్యుల వారి ఆశ్రమానికి వచ్చి "నర్మదానదిని కమండలంలో బంధించగల శిష్యుడు నీకు లభిస్తాడు. అతడే బ్రహ్మసూత్రాలకు భాష్యం వ్రాస్తాడు." అని చెప్పాడు. ఆ మాటలు ఇప్పుడు గుర్తుకు వచ్చి శంకరుణ్ణి కాశీనగరానికి వెళ్ళి, విశ్వేశ్వరుని దర్శించి, బ్రహ్మసూత్రాలకు భాష్యం వ్రాయమని ఆశీర్వదించి పంపాడు గోవిందపాదుడు.

గురువుగారి అనుజ్ఞమీద కాశీనగరం బయలుదేరాడు శంకరుడు. మార్గమధ్యంలో ఒక అడవిగుండా వెడుతున్నాడు. చీకటిపడింది. ఒక మర్రిచెట్టు క్రింద విశ్రాంతి తీసుకున్నాడు. ఒకరాత్రివేళ చెట్టుమీద ఉన్న బ్రహ్మరాక్షసుడు శంకరుణ్ణి పట్టి పీడించసాగాడు. అప్పుడు శంకరుడు అతని ప్రశ్నలకు సమాధానాలు చెప్పగా, సంతసించి వ్యాసమహర్షిని దర్శించే ఉపాయంచెప్పి, శాపవిమోచనంపొంది అంతర్ధానమై పోయాడు.

కాశీనగరంలో శంకరుడు కొంతమంది శిష్యులను ఏర్పరచుకొని, బదరికా వనానికి వెళ్ళి, మందాకినీ నదీతీరాన నివసిస్తూ, ప్రస్థానత్రయము అని చెప్పబడే ఉపనిషత్తులు, భగవద్గీత, బ్రహ్మసూత్రాలతో పాటుగా 18 భాష్యాలు, 40 ప్రకరణ గ్రంథాలు, 74 చిన్న గ్రంథాలు వ్రాశాడు. ఆ సమయంలో వ్యాసమహర్షి వృద్ధ బ్రాహ్మణరూపంలో వచ్చి, బ్రహ్మసూత్రాలకు శంకరుడు వ్రాసిన భాష్యంవిని, ఆనందించి, అద్వైతమతస్థాపన చెయ్యమని ఆశీర్వదించి అంతర్ధానమైనాడు.

తరువాత కాలంలో పండితులందరినీ తనవాదనతో ఓడిస్తూ, అద్వైతమత స్థాపన చేస్తూ, ప్రయాగలో కర్మసిద్ధాంతవాది అయిన కుమారిలభట్టును వాదనకు

పిలువగా, ఆయన శంకరుడు సాక్షాత్తూ ఆదిశంకరుడని గ్రహించి, ఓటమి నంగీకరించి, తన శిష్యుడైన మండనమిశ్రుని గెలవమన్నాడు. ఇక్కడ మండనమిశ్రుని గురించి మనం కొంత తెలుసుకోవాలి.

మహిష్మతీ నగరంలో ఉండేవాడు మండనమిశ్రుడు. ఇతడు మహాపండితుడు, సాక్షాత్తు బ్రహ్మదేవుడే మండనమిశ్రుడిగా జన్మించాడు. చదువులతల్లి సరస్వతీదేవియే ఉభయభారతి అనే పేరుతో మండనమిశ్రునికి భార్య అయింది. మహిష్మతీనగరం చేరాడు శంకరుడు తన శిష్య గణంతో. త్రోవలో కనిపించిన వారిని అడిగాడు 'మండనమిశ్రుని ఇల్లు ఎక్కడ?' అని. దానికి వారిచ్చిన సమాధానం చూడండి. ఏ ఇంటిద్వారం దగ్గర చిలుకలు 1) వేదాలు స్వతఃప్రమాణాలా ? 2) సుఖదుఃఖాల ఫలితాన్ని పరమాత్మ ఇస్తాడా ? లేక కర్మ ఇస్తుందా ? 3. ఈ జగత్తు నిత్యమా ? కాదా అనే ప్రశ్నలు వాదిస్తూ ఉంటాయో అదే మండనమిశ్రుని ఇల్లు అన్నారు. అతని ఇంట్లో ఉన్న పండితులే కాదు చిలుకలు కూడా శాస్త్రచర్చ చేస్తాయి. అంటే ఆ మహానుభావుడు మండనమిశ్రుడు ఎంతటి పండితుడో ఆలోచించండి.

మండనమిశ్రుని ఇల్లు చేరాడు శంకరుడు ఆ సమయంలో తండ్రి శ్రాద్ధకర్మ చేస్తున్నాడు మండనమిశ్రుడు. వచ్చిన శంకరుణ్ణి సాక్షాత్తు విష్ణు స్వరూపంగా భావించి గౌరవించాడు. శంకరుడు తాను వచ్చిన పని చెబుతూ, పండితోత్తమా ! నీతో వాదానికి వచ్చాను అన్నాడు. ఆనందంగా అంగీకరించాడు మండనమిశ్రుడు. మధ్యవర్తిగా మండనమిశ్రుని భార్య ఉభయభారతీదేవిని ఉంచటానికి ఒప్పందం కుదిరింది.

ఈ వాదనలో ఓడినవాడు గెలిచినవారికి శిష్యుడు కావాలి. మండనమిశ్రుడు గనక ఓడిపోతే అతడు సన్యసించి శంకరుడికి శిష్యుడై అద్వైతసిద్ధాంతాన్ని ప్రచారం చేస్తాడు. శంకరుడు గనక ఓడిపోతే సన్యాసం వదలి, వివాహం చేసుకుని కర్మ సిద్ధాంతాన్ని ప్రచారం చేస్తాడు. అదీ పందెం. భారతీదేవి రెండు పూలదండలు తెప్పించి వారి మెడలో వేసి 'వాదనలో ఓడిపోయిన వారి మెడలోని మాల వాడిపోతుంది' అని చెప్పింది.

వాదన ప్రారంభమైంది. అనేక విషయాలమీద వాదన జరిగింది. ఆ శాస్త్రచర్చ వినటానికి దూరప్రాంతాల నుండి పండితులు వచ్చారు. అలా కొన్ని రోజులపాటు

చర్చ జరిగింది. చివరకు మండనమిశ్రుని మెడలోని మాల వాడిపోయింది. "మీరు ఉభయులూ భిక్షకు లేవండి" అన్నది భారతీదేవి. అంటే మండనమిశ్రుడు ఓడిపోయాడు. అతడు సన్యాసం స్వీకరించాలి అని చెప్పిందన్న మాట. సన్యాసులు స్వీకరించేది భిక్ష. మండనమిశ్రుడు ఓడిపోయాడు. అప్పుడు భారతీదేవి శంకరునితో 'ఓ ఆచార్యా ! మండనమిశ్రుని మీరు పూర్తిగా గెలవలేదు. ఎందుకంటే ఆయనలో సగభాగం నేను. కాబట్టి నన్ను కూడా గెలవాలి అన్నది. వీరిద్దరి మధ్య 17 రోజులు రాత్రింబవళ్ళు చర్చజరిగింది. శంకరుడు జంకటం లేదు. ఇక లాభం లేదు. శంకరుడు చిన్ననాడే సన్యాసం స్వీకరించాడు. విషయవాసనలు లేనివాడు కాబట్టి కామకళని గురించి ప్రస్తావిస్తే బాగుంటుంది అని తలచి కామశాస్త్రం మీద ప్రశ్నలు వేసింది భారతీదేవి. శంకరుడు నెలరోజులు విరామమడిగాడు ఆమె సరేనన్నది.

ఆ సమయంలో అమరుకమహారాజు హఠాత్తుగా మరణించాడు. అతని శరీరంలోకి ప్రవేశించాడు శంకరుడు. కామశాస్త్రరహస్యాలన్నీ తెలుసుకుని తిరిగి వచ్చి, భారతీదేవి అడిగిన ప్రశ్నలకు సమాధానము చెప్పి ఆమెను కూడా ఓడించాడు. తరువాత మండనమిశ్రునికి సంప్రదాయబద్ధంగా సన్యాసదీక్ష ఇచ్చి **'సురేశ్వరాచార్యులు'** అని నామకరణం చేసి తన శిష్యునిగా చేసుకున్నాడు.

మూకాంబాక్షేత్రంలో పుట్టినదగ్గరనుంచీ జడుడుగాఉన్న 'ప్రభాకరుడు' అనే బాలుని అనుగ్రహించి అతడికి సన్యాసమిచ్చి **'హస్తామలకుడు'** అని పేరు పెట్టాడు. శంకరుడు శృంగేరి చేరి, ఒక మఠాన్ని స్థాపించి దానికి సురేశ్వరాచార్యుని అధిపతిగా చేశాడు. అక్కడ మందబుద్ధి అయిన ఒక బాలుని కేవలం సంకల్పమాత్రం చేతనే పండితుడుగా చేసి, సన్యాసమిచ్చి **'తోటకాచార్యుడు'** అని నామకరణం చేశాడు.

ఎంతకాలమైనా శంకరుడికి దేవితత్త్వం గురించి పూర్తిగా తెలియలేదు. అందుచేత తన గురువుగారైన గోవిందపాదాచార్యుని దగ్గరకు పోయి దేవీతత్త్వాన్ని వివరించమని అడిగాడు. దానికి గోవిందపాదుడు తనగురువైన గౌడపాదుల దగ్గరకు వెళ్ళమన్నాడు. ఈ రకంగా శంకరాచార్యుడు తన పరమగురువైన గౌడపాదాచార్యుల వారి దగ్గరకు వెళ్ళాడు. గౌడపాదుడు అఖండ ప్రజ్ఞాశాలి. మాండూక్యోపనిషత్తుకు కారికలను వ్రాసిన మహానుభావుడు. గౌడపాదుడు శంకరుని కోరిక విని, తాను

వ్రాసిన 'సుభగోదయస్తుతి' అనే 52 శ్లోకాలు గల గ్రంథాన్ని శంకరుడి చేతికిచ్చాడు. ఆ గ్రంథం చదివిన తరువాత శంకరుడు శ్రీశైలానికి వచ్చి **'సౌందర్యలహరి'** అనే గ్రంథం వ్రాశాడని ప్రతీతి.

శంకరుడు జైత్రయాత్ర చేస్తూ ద్వైతులను, శాక్తేయులను, లక్ష్మీఉపాసకులను, వీరశైవులను, వీరవైష్ణవులను, పాంచరాత్రులను, సూర్య, అగ్ని, గణపతి ఉపాసకులను అందరినీ ఓడించి అద్వైతమతాన్ని పునఃప్రతిష్ఠ చేశాడు.

తన జైత్రయాత్రలో భాగంగా 'మగధ' చేరాడు శంకరుడు. అక్కడి ప్రజలు శంకరుడి దగ్గరకు వెళ్ళి "అన్నీ తెలిసిన మీబోటివారికి నిర్గుణోపాసన సరిపోతుంది. కాని మావంటివారి సంగతి ఏమిటి?" అని అడిగారు. శంకరుడు వారి కోరిక మన్నించి సగుణోపాసనకు అనువుగా షణ్మతస్థాపన చేసి, ఉపాసనాపద్ధతులు, బహుదేవతాస్తుతులు వ్రాశాడు. అర్చనలో అందరూ విధిగా అర్చించాలి అని పంచాయతనాన్ని ఏర్పాటు చేశాడు. పంచాయతనం అంటే ఆదిత్యుడు, అంబిక, గణపతి, విష్ణువు, శివుడు. ఈ ఐదుగురు దేవతలను ప్రతివారు అర్చించాలి. అని నియమం. ఈ పంచాయతనము పంచభూతాలకు ప్రతీక. ఇందులో

| | | |
|---|---|---|
| ఆకాశతత్త్వము | – | శివుడు |
| వాయుతత్త్వము | – | సూర్యుడు |
| అగ్నితత్త్వము | – | అంబిక |
| జలతత్త్వము | – | నారాయణుడు (విష్ణువు) |
| పృథివీతత్త్వము | – | గణపతి |

ఈ ఐదుగాక షణ్ముఖుడికి (సుబ్రహ్మణ్యేశ్వరుడికి) కూడా ప్రత్యేకమైన అర్చన చెప్పాడు.

ఆ రోజుల్లో కాశ్మీరదేశంలో సర్వజ్ఞశారదాపీఠం ఉండేది. దానికి ఎనిమిది దిక్కులయందు ఉద్దండులైన పండితులుంటారు. ఆ పండితులను ఓడించి, ఆ పీఠాన్ని అధిష్ఠించినవాడే జగద్గురువు. శంకరుడు వారందరినీ ఓడించి, ఆ పీఠాన్ని అధిష్ఠించబోతుండగా, సరస్వతీదేవి ప్రత్యక్షమై "నీకు స్త్రీసంగమదోషమున్నది. కాబట్టి

నువ్వు ఈపీఠంఎక్కటానికి అర్హుడవు కావు." అన్నది. దానికి, శంకరుడు వేరొక శరీరంతో చేసిన పాపం ఈ శరీరానికి అంటదు అని సమాధానం చెప్పాడు. ఆ మాటలువిన్నసరస్వతీదేవి నివ్వెరబోయింది. శంకరాచార్యుడు సర్వజ్ఞశారదాపీఠాన్ని అధిష్టించి జగద్గురువైనాడు.

అద్వైతమతప్రచారం కోసం శంకరుడు భారతదేశంనలుమూలలా నాలుగు పీఠాలు నెలకొల్పాడు. అవి

| | | |
|---|---|---|
| దక్షిణాన | – | శృంగేరి (కర్ణాటక) |
| పడమర | – | ద్వారక (గుజరాత్) |
| ఉత్తరాన | – | బదరి (ఉత్తరాంచల్) |
| తూర్పున | – | పూరి (ఒరిస్సా) |

ఈ పీఠాలకు వరుసగా సురేశ్వరాచార్యుడు, హస్తామలకుడు, తోటకాచార్యుడు, పద్మపాదులను పీఠాధిపతులుగా నియమించి, కేదారము చేరి, శిష్యులను ఆశీర్వదించి, దత్తాత్రేయుని గుహలోకి వెళ్ళి అదృశ్యమై పోయాడు.

శంకర భగవత్పాదుల వారు బ్రహ్మసూత్రాలకు భాష్యం వ్రాశారు. శంకరుడు వ్రాసిన భాష్యాన్ని గంగానదీ తీరంలో తన శిష్యులకు బోధిస్తుండగా విని, స్వయంగా శంకరుణ్ణి ప్రశ్నించి, తగిన సమాధానాలు తెలుసుకుని సంతోషించాడు వ్యాసుడు.

శంకర భగవత్పాదులవారు దేశం మొత్తం అనేకసార్లు తిరిగి అన్ని మతాలను ఖండించి అద్వైతాన్ని పునః ప్రతిష్ట చేశాడు.

# బ్రహ్మసూత్రాలు

## మొదటి అధ్యాయం

### మొదటి పాదం

### 4. బ్రహ్మజిజ్ఞాస

బ్రహ్మసూత్రాలు మొత్తం 191 అధికరణలుగా ఉన్నాయి. మొదటి పాదంలో పదకొండు అధికరణలు ముప్ఫై ఒక్క సూత్రాలు ఉన్నాయి. అందులో మొదటి అధికరణను ప్రారంభం చేస్తున్నాము. ఇది **జిజ్ఞాసాధికరణము.** ఇందులో ఒకటే సూత్రం ఉంది.

***సూత్రం - 1* "అథాతోబ్రహ్మజిజ్ఞాస".**

అథ – పిమ్మట, అతః – కాబట్టి, బ్రహ్మజిజ్ఞాసా – బ్రహ్మమును తెలుసుకోవాలనే కోరిక. వివేకాది సాధన సంపత్తి సిద్ధించిన తరువాత కర్మఫలం అనిత్యము, అశాశ్వతము, మోక్షము నిత్యము, పరబ్రహ్మయే సత్యము అని తెలిసింది కాబట్టి ముముక్షువు బ్రహ్మను గురించి తెలుసుకోవటానికి ప్రయత్నించాలి.

సాధకుడు వేదవేదాంగాలు చదివాడు. బ్రహ్మచర్యం పూర్తయింది. గృహస్తు అయినాడు. శాస్త్రోక్తంగా యజ్ఞయాగాలు నిర్వహించాడు.

**బ్రహ్మచర్యం :** పూర్తిగా విద్యాభ్యాసానికి ఉపయోగించేది బ్రహ్మచర్యం. బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు మూడు వర్ణాల వారు కూడా తమ పిల్లలకి ఉపనయనం చేసి విద్యాభ్యాసం కోసం గురువుగారి దగ్గరకి పంపుతారు. ఉపనయనము అనేది రెండవ జన్మ. అలా ఉపనయనం చేయబడ్డ వాళ్ళు ద్విజులు అనబడతారు. విద్యార్థులు గురుకులంలో చేరి విద్యాభ్యాసం చేస్తారు. విద్యాభ్యాసం చెయ్యటానికి మూడు పద్ధతులున్నాయి. 1. గురువు గారికి సేవలు చేసి విద్య నేర్చుకోవటము. 2. గురువు గారికి పుష్కలంగా ధనమిచ్చి విద్య నేర్చుకోవటము. 3. తనకు వచ్చిన విద్యను గురువు గారికి చెప్పి ఆయన దగ్గర తనకు కావలసింది నేర్చుకోవటము. ఇంక నాలుగవ పద్ధతి అనేది లేదు. అయితే ఎక్కువమంది గురువుకు

సేవలుచేసి విద్యనేర్చుకునేవారు. విద్యార్థిదశను దీర్ఘసత్రంగా చెబుతోంది శతపథ బ్రాహ్మణం. గురువుగారికి సేవలు చెయ్యటం అంటే ఆశ్రమంలో జరిగే నిత్యాగ్ని హోత్రానికి, హోమాలకు కావలసిన సమిధలు తేవటం, పశువులను మేపటం వంటివి. ఐతరేయ, తైత్తిరీయ బ్రాహ్మణాలలో నాభానేధిష్ఠుడు, భరద్వాజుడు వీరి కథలు గురుకులంలో విద్యాభ్యాసం ఎలా జరిగేదో వివరిస్తాయి. భాగవతంలో కృష్ణుడు సుదాముడు గురుకులంలో ఎలా గడిపారో వివరించటం జరిగింది.

బ్రహ్మచారి అవలంబించవలసిన పద్ధతులు, ఆచారాలు, నిష్ఠలు కొన్నిఉన్నాయి. ముందుగా అతడు నిద్రను త్యజించాలి. కృష్ణాజనాన్ని మాత్రమే ధరించాలి. నేలమీదనే పడుకోవాలి. కీర్తిప్రతిష్టల కోసం ఎదురు చూడరాదు. కోపము అనేది అసలు ఉండరాదు. ఇతరులను ఎప్పుడూ బాధించరాదు. మాటలతో కూడా. సౌందర్యపోషణ పనికిరాదు. సుగంధ ద్రవ్యాలు వాడరాదు. తాంబూలం వేసుకోరారు. స్త్రీని నగ్నంగా ఉన్నప్పుడు చూడరాదు. నేలమీద దిగువస్థానంలో మాత్రమే కూచోవాలి. మంచం మీద పడుకోరాదు. జీవహింస చెయ్యరాదు. నడిచేప్పుడు కూడా అతినెమ్మదిగా నడవాలి. సంగీతం వినరాదు. నృత్యం చూడరాదు. నేలమీద ఇష్టం వచ్చినట్లు ఉమ్మివేయరాదు అని గోపథబ్రాహ్మణం చెబుతోంది. వీరికి వేదవేదంగాలు చెప్పబడేవి. సంహిత, బ్రాహ్మణము, అరణ్యకము ఉపనిషత్తు శాస్త్రాలు అన్నీ చెప్పేవారు. ఇవి కాక న్యాయం తర్కం, ఇతిహాసాలు, పురాణాలు, జ్యోతిష్యం, సర్పవిద్య, సాముద్రికం మొదలైన అన్నివిద్యలు నేర్పబడేవి. అని శతపథ బ్రాహ్మణం చెబుతోంది. విద్యవిషయంలోను, యజ్ఞయాగాది కర్మల విషయంలోను చర్చలు జరుగుతుంటాయి. శతపథబ్రాహ్మణంలో ఇలాంటి వాదనలు, చర్చలు అనేకం వివరించబడ్డాయి. యాజ్ఞవల్క్యుడు శాకల్యుడు, ఉద్దాలకుడు ప్రాచీనశీలుడు ఇలా వీరి మధ్య జరిగిన వాదనలు వివరించింది శతపథ బ్రాహ్మణం. బ్రహ్మచారులు రెండు రకాలుగా ఉంటారు అని శతవథ బ్రాహ్మణం చెబుతోంది.

1. నైష్ఠిక బ్రహ్మచారులు 2. ఉపకుర్వాణ బ్రహ్మచారులు

**1. నైష్ఠిక బ్రహ్మచారులు :** విద్యాభ్యాసం పూర్తి చేసి, సమావర్తనము, స్నాతక వ్రతము చేసి ఇంటికి పోకుండా, జిజ్ఞాసువై గురువుగారి దగ్గరే ఉంటూ నియమ నిష్ఠలతో బ్రహ్మచర్యం పాటిస్తూ, నిరంతరము సత్యాన్వేషణలో కాలం గడిపేవాడు.

వీరు వివాహం చేసుకోరు. కాబట్టి మిగిలిన ఆశ్రమాలు గృహస్తాశ్రమము, వానప్రస్తము ఉండవు. ఇలాటి బ్రహ్మచారులను శతపథబ్రాహ్మణం **'వర్చస్వంతులు'** అంటోంది.

**2. ఉపకుర్వాణ బ్రహ్మచారులు :** గురువుగారి దగ్గర విద్యాభ్యాసం పూర్తి చేసి, సమావర్తనమాచరించి ఇంటికి పోయి స్నాతకవ్రతం చేసి తగిన పిల్లను చూసి వివాహం చేసుకుని, గృహస్థాశ్రమంలో అడుగు పెడతారు. గురువుగారి దగ్గర నుండి వచ్చేటప్పుడు గురుదక్షిణ చెల్లించి రావాలి. సామాన్యంగా తనకు ఏం కావాలో గురువే చెప్పాలి. గురుదక్షిణ చెల్లించిన తరువాత మాత్రమే గురుకులం నుంచి బయటపడతారు. ఇక్కడ ఇంకొక ముఖ్యమైన విషయం. గురువుగారి దగ్గర ఆయన యజ్ఞశాల నుంచి గార్హపత్యాగ్నిని తెచ్చుకుని తన గృహంలో అగ్నిహోత్రాన్ని ప్రతిష్టించాలి. ఇక జీవితాంతం ఈ అగ్ని అతని ఇంట్లో ప్రజ్వరిల్లుతూనే ఉండాలి. పూర్వకాలంలో అగ్ని ఎక్కడ పడితే అక్కడ, ఎప్పుడు కావాలంటే అప్పుడు దొరికేది కాదు. అందుకే అగ్నిని ఇంట్లో ఉంచుకునేవారు. ఇవాల్టిరోజున ఆ అవసరం లేదు అంటారు ఆధునికులు.

ఇక గురువులు కూడా రెండు రకాలుగా ఉన్నారు.

**1. స్థిరగురువులు :** ఒకే ప్రాంతంలో ఆశ్రమాన్ని నిర్మించుకుని, తన వద్దకు వచ్చే వారికి విద్యాబోధన చేసేవాడు.

**2. సంచార గురువు :** వీరు దేశాటనం చేస్తుంటారు. ఇలాటి గురువులను (చరకులు) అంటారు. అంటోంది శతపథ బ్రాహ్మణం. ఏ రకమైన ఫలితము ఆశించకుండా ఆవిద్యాభ్యాసం పూర్తి చేసేవారు. విద్యని వీరిని కూడా శతపథ బ్రాహ్మణంలో చెప్పటం జరిగింది.

ఎన్ని శాస్త్రాలు చదివినా, యజ్ఞయాగాలు చేసినా, దేవతలను అర్చించినా, జీవాత్మ పరమాత్మల ఏకత్వం గురించి తెలియకపోతే ఉపయోగం లేదు. అటువంటి వాడికి ఎన్ని కల్పాలు గడచినా మోక్షం రాదు. ధనంవల్ల మోక్షం లభించదు. కర్మలవల్ల మోక్షం రాదు. కర్మాచరణ వల్ల ఉత్తమలోకాలు మాత్రమే ప్రాప్తిస్తాయి. కేవలము జ్ఞానమే మోక్షానికి మార్గము.

అందుచేత విద్వాంసుడు ఐహిక భోగాలను వదలిపెట్టి, మంచి గురువును శరణుజొచ్చి, ఆయన ఉపదేశాలు శ్రద్ధగా వింటూ, బ్రహ్మచర్య దీక్ష పాటిస్తూ,

మోక్షమార్గం కోసం ప్రయత్నించాలి. సద్వస్తువైన ఆత్మను దర్శించటంలో నిమగ్నుడై, యోగియై సంసార సాగరంలో పడి కొట్టుమిట్టాడుతున్న తన ఆత్మను ఉద్ధరించుకోవాలి.

ఈ విధంగా ఎల్లప్పుడూ ఆత్మదర్శనాభ్యాస తత్పరుడైన విద్వాంసుడు సమస్త కర్మలను వదిలి, ప్రాపంచిక బంధనాల నుండి విముక్తి పొందటానికి ప్రయత్నించాలి. కర్మలు బంధహేతువులు. కాబట్టి కర్మపరిత్యాగం చెయ్యాలి. కర్మలవల్ల చిత్తశుద్ధి జరుగుతుంది. అంతేకాని జ్ఞానం మాత్రం రాదు. గురువు చేసిన బోధలు వినటం వల్ల, వాటిని గురించి ఆలోచించటం వల్ల ఆత్మజ్ఞానం కలుగుతుంది. అంతేకాని ఎన్ని తీర్థాలు సేవించినా, దానధర్మాలు చేసినా, సత్రాలు కట్టించినా, కర్మలు చేసినా జ్ఞానం మాత్రం రాదు.

ఆ ఆత్మనిష్ఠ కలగాలంటే విద్వాంసుడికి నాలుగు లక్షణాలుండాలి. వాటినే సాధన చతుష్టయము, సాధన సంపత్తి అంటారు. ఇవే మోక్షసాధనాలు. సాధన చతుష్టయము అంటే –

**1. నిత్యానిత్యవివేకము :** ఏది సత్యము? ఏది అసత్యము? ఏది నిత్యము? ఏది అనిత్యము? అనే విషయ పరిజ్ఞానం. **బ్రహ్మ సత్యం. జగన్ మిథ్య,** కనిపించే జగత్తంతా అనిత్యమైనది. బ్రహ్మ ఒక్కటే శాశ్వతమైనది.

**2. <u>వైరాగ్యము</u> :** ఇహలోక సుఖాలపట్ల విముఖత, శరీరం మొదలు బ్రహ్మలోకం వరకు ఉండే భోగ్య పదార్థాలన్నింటిమీద అసహ్య భావన కలగటం.

**3. <u>షట్సంపత్తి</u> :** ఇవి మొత్తం 6.

1. శమము – అంతరింద్రియ నిగ్రహము
2. దమము – బాహ్యేంద్రియ నిగ్రహము. ఇంద్రియాలను వాటివాటి విషయాల నుండి మళ్ళించి, వాటి స్థానాలలో వాటిని నిలిపి వేయటం.
3. ఉపరతి – కర్మపరిత్యాగం. బాహ్యవిషయాలను చిత్తవృత్తులతో ఆశ్రయించకుండా ఉండటము.
4. తితిక్ష – శీతోష్ణ సుఖదుఃఖాలను సహించే శక్తి. చింత, బాధ మొదలయినవి లేకుండా, సమస్త సుఖ దుఃఖాలు కష్టాలు సహించటం. ఎదుర్కో గలిగిన సామర్థ్యం ఉండికూడా అపకారికి ఉపకారం చెయ్యటం.
5. శ్రద్ధ – గురువు నందు, ఆయన చెప్పే విషయాల యందు విశ్వాసము.
6. సమాధి – బుద్ధిని ఎప్పుడూ బ్రహ్మమునందే నిలిపి ఉంచటం.

**4. ముముక్షత్వము :** మోక్షం పొందాలనే కోరిక. అహంకారం దగ్గర నుండి బ్రహ్మ వరకు శరీరానికి అంతా అజ్ఞానంతో కల్పించబడిన బంధానాలే. ఆత్మజ్ఞానం పొందటం ద్వారా ఈ బంధనాలను త్రెంచుకోవచ్చు.

బ్రహ్మసూత్రాలు అనబడే ఈ గ్రంథం 'వేదాంత మీమాంశ' ఉత్తర మీమాంశ అని కూడా చెప్పబడుతుంది. వేదాంతము. అంటే వేదములలో చివరి భాగము ఉపనిషత్తులు. మీమాంశ అంటే పరిశీలన. ఈ గ్రంథాన్ని 'ఉత్తరమీమాంశ' అన్నారు కదా ! మరి 'పూర్వ మీమాంశ' అనే గ్రంథం ఏదైనా ఉన్నదా? అంటే జైమిని మహర్షి వ్రాసిన **పూర్వప్రజ్ఞాదర్శనమే** 'పూర్వమీమాంశ' అంటారు. ఇది 12 అధ్యాయాలు గల న్యాయశాస్త్రము. దీనినే జైమిని న్యాయసూత్రాలు అని కూడా అంటారు.

క్రీస్తుపూర్వము 4వ శతాబ్దంలో కృష్ణద్వైపాయనుడి శిష్యుడైన జైమిని ఈ గ్రంథం వ్రాశాడు. దీనికి శబరస్వామి భాష్యం వ్రాశాడు. క్రీస్తుశకము 7వ శతాబ్దంలో కుమారిలభట్టు శబర భాష్యానికి వాఖ్య వ్రాయగా క్రీ॥శ॥ 650కి చెందిన ప్రభాకర మిశ్రుడు కూడా 'బృహతి' అనే వ్యాఖ్య వ్రాశాడు.

వీరి సిద్ధాంతము ప్రకారము వేదాలు నిత్యములు, అపౌరుషేయాలు. ఇందులో అనుమానం లేదు. సర్వజ్ఞుడైన పురుషుడు ఎవరైనా వాటిని చెప్పి ఉండవచ్చు అనే వైశేషికులవాదనను కూడా వీళ్ళు అంగీకరించరు. మీమాంసకుల ప్రకారము సర్వజ్ఞుడైన పురుషుడు ఈ కాలంలో గాని, పూర్వకాలంలో గాని ఎవ్వరూ లేరు. ఏ మానవుడు సర్వజ్ఞుడు కాలేడు. వేదాలు ఈశ్వర నిర్మితాలు కావు. అసలు ఈశ్వరుడున్నాడని వీరు ఒప్పుకోరు. ఈశ్వరుడు లేకుండా ఈ ప్రపంచం ఎలా ఆవిర్భవించింది? అంటే ఈ ప్రపంచం ఎవరిచేతా సృష్టించబడింది కాదు. ఇది శాశ్వతంగా ఇలాగే ఉంటుంది. ఈశ్వరుడున్నాడనటానికి ప్రమాణం ఏమీ లేదు. ఒకవేళ ఈశ్వరుడున్నా అతడు సర్వజ్ఞుడు కాడు. ఆయనకు నోరు లేదు. కాబట్టి మాట్లాడలేడు. మరి నోరు లేనివాడు వేదాలనెలా చెబుతాడు? వేదాలలో కొన్ని విశేషమైన అర్థాలున్నాయి. అవి స్వతస్సిద్ధాలు. అవి ఎవరితోనూ చెప్పబడినవి కావు. అందుకే అవి పరమ ప్రమాణాలు. వేదాలు ఈశ్వరుని నుంచి వచ్చినాయి. అంతేకాని ఈశ్వరుడు రచించినవి కాదు. మనదేశంలో అన్నింటికీ ప్రమాణం వేదం. మరి ఆ వేదానికి ప్రమాణం ఏముంటుంది? అందుకే **వేదాలు స్వతఃప్రమాణాలు**. ఈ వేదాలను

సరిగా అర్థం చేసుకోటానికే షట్శాస్త్రాలు చెప్పబడ్డాయి. ఇవి ఆరు శాస్త్రాలు. 1.శిక్ష 2. వ్యాకరణము 3. జ్యోతిషము 4. అలంకారము 5. ఛందస్సు 6.తర్కము అని కొందరు చెబుతారు. 1. శిక్ష 2. వ్యాకరణము 3. జ్యోతిషము 4. నిరుక్తము 5. అలంకారము 6 ఛందస్సు అని కొందరు చెబుతారు. సాయణాచార్యుడు పూర్వమీమాంసని ఆధారంగా తీసుకుని వేదానికి భాష్యం చెప్పాడు. పూర్వమీమాంస గనక తెలియకపోతే వేదవాక్య నిర్ణయం చెయ్యటం సాధ్యం కాదు. వేదవాక్య నిర్ణయానికి కావలసిన మర్యాదలు, సంప్రదాయాలను మీమాంసశాస్త్రం చెప్పింది. వేదవిద్య గ్రంథస్తం కాదు. అది కంఠస్తము. ఇది గురుశిష్య సంప్రదాయంగానే వచ్చింది. అందుకే ఇది 'శ్రూయమానము' అంటారు. గురుముఖతః అధ్యయనం చేస్తేనే అపూర్వత కలుగుతుంది. విధులు మూడు రకాలు 1. విధి 2. నియమవిధి 3. పరిసంఖ్యావిధి అని వేదవాక్యాలను మూడు రకాలుగా మీమాంసకులు నిర్ణయించారు. కొన్ని వేదవాక్యాలు ఆయా కర్మలను విధిస్తాయి అంటే నియమాలను విధిస్తాయి. వడ్లనుంచి బియ్యం తియ్యాలి అన్నప్పుడు ఎన్నో రకాలుగా బియ్యం తియ్యచ్చు. వడ్లు దంచి, చేత్తోవలచి, కాళ్ళతో తొక్కి బియ్యం తియ్యవచ్చు కాని వడ్లు దంచి మాత్రమే బియ్యం తియ్యాలని చెబుతోంది వేదం. అలాగే వేదార్థం తెలుసుకుని, మీమాంస చెయ్యాలి.

వేదాన్ని ఎలా అధ్యయనం చెయ్యాలి? గ్రంథాలు చూసి చదువుకోవచ్చు అని కొంతమంది భావిస్తుంటారు. వేదంలో అనుదాత్తము, ఉదాత్తము, స్వరితము, దీర్ఘస్వరితము, ప్లుతము అని ఐదురకాలు ఉన్నాయి. వీటిని బాగా తెలుసుకుని వేదం గురుముఖతః నేర్చుకోవాలి. సృష్టి ప్రారంభం నుంచి గురుశిష్య పరంపరగా వస్తోంది వేదాధ్యయనం. వేదాలలో చెప్పబడిన ధర్మానికే **'త్రయీధర్మము'** అని పేరు. యజ్ఞయాగాది క్రతువులు ఎప్పుడు చెయ్యాలి? ఎలా చెయ్యాలి? అనే విధానం అంతా బ్రాహ్మణములలో చెప్పబడింది.

ఈ మతంలో ఈశ్వరుడితో సంబంధము లేదు. యజ్ఞఫలం రావాలంటే పరమేశ్వరుడితో సంబంధం లేదు. కర్మే ఫలితాన్నిస్తుంది.

**ద్రవ్యములు :** ఈ మతంలో కుమారిలభట్టు, ప్రభాకరమిశ్రుడు ఇద్దరూకూడా ప్రసిద్ధి చెందినవారే. అయితే వీళ్ళిద్దరి మధ్యా అనేక విషయాలలో భేదమున్నది. కుమారిలభట్టు ప్రకారము పదార్థాలు రెండు రకాలు 1. భావములు 2. అభావములు. ఇందులో భావపదార్థాలు ఆరు అవి.

1. ద్రవ్యము 2. గుణము 3. కర్మ 4. సామాన్యము 5. శక్తి 6. అభావము

అభావములు నాలుగు విధాలు

1. పూర్వము 2. పరము 3. పూర్ణములు 4. అన్యోన్య సంబంధములు.

వీటిలో ద్రవ్యము మళ్ళీ పదకొండు రకాలుగా ఉంటుంది. అవి 1.పృథివి 2.జలము 3. తేజస్సు 4. వాయువు 5. ఆకాశము 6. ఆత్మ 7. మనస్సు 8. దేశము 9. కాలము 10. తమస్సు 11. శబ్దము వీటిలో కొన్నింటిని ప్రభాకరమిశ్రుడు అంగీకరించలేదు.

ఈ రకంగా వ్యాసుని శిష్యుడైన జైమిని పూర్వమీమాంశలో ధర్మసూత్రాలు వ్రాయగా, సర్వజ్ఞుడైన వ్యాసుడు **బ్రహ్మదర్శనం కోసం ఉత్తర మీమాంశ** వ్రాశాడు. వేదానికి అర్థం కేవలము కర్మలు కాదు. జీవబ్రహ్మైక్యం గురించి వేదంలో చెప్పబడలేదు కాని వేదాలకు అంతమందున్న ఉపనిషత్తులలో ఉంది. వేదము యొక్క ప్రమాణము వేదాల చివరన ఉన్న ఉపనిషత్తులకు కూడా ఉన్నది. అందుచేతనే వేదాంతంకూడా వేదమే. కాబట్టి వేదప్రమాణం గల **ఉపనిషత్తులసారాన్ని బ్రహ్మసూత్రాలుగా వ్రాశాడు వ్యాసమహర్షి.**

'జిజ్ఞాస' అంటే కోరిక. బ్రహ్మ జిజ్ఞాస అంటే బ్రహ్మను గురించి తెలుసుకోవాలనే కోరిక. ఇది ఎందుకు? తాపత్రయ నివృత్తికోసం. తాపత్రయాలు అంటే మూడు రకాలయిన తాపములు. అవి 1. ఆది భౌతిక 2. ఆది దైవిక 3. ఆధ్యాత్మికములు.

**1. ఆదిభౌతికము :** తనకన్న ఇతరులైన వారి వలన వచ్చిన బాధల వల్ల పరితపించుట. భార్యాపుత్రులు, సర్ప వృశ్చికాదులు, అగ్ని, వరద, భూకంపాలవంటివి.

**2. ఆదిదైవికము :** దైవముచే కలుగచేయబడేవి

**3. ఆధ్యాత్మికము :** దేహేంద్రియాలకు గలిగిన అధివ్యాధులచే అనగా అలసత్వము, కపటము, అవిశ్వాసము, అశ్రద్ధ మొ॥వాటితో దుఃఖించుట.

ఈ మూడు రకాలయిన దుఃఖాలు శాశ్వతంగా పోవాలంటే జన్మరాహిత్యం తప్ప ఇంకొక మార్గం ఏదీలేదు. వేదాంతశాస్త్రం చెప్పేది జన్మరాహిత్యం. అదే మోక్షం. ఆ మోక్షం పొందటానికే ఈ బ్రహ్మజిజ్ఞాస. బ్రహ్మజిజ్ఞాసకు ఫలితం బ్రహ్మప్రాప్తి. అంటే మోక్షం. **"బ్రహ్మవిద్ బ్రహ్మైవభవతి"** బ్రహ్మ నెరిగినవాడు కూడా బ్రహ్మమే అవుతాడు.

మనం తెలుసుకోవలసినది బ్రహ్మము గురించి. బ్రహ్మము గురించి తెలుసుకున్న వాడు కూడా బ్రహ్మమే. కాబట్టి తెలుసుకోవలసినది, తెలుసుకున్నవాడు ఈ రెండూ పరబ్రహ్మ స్వరూపమే. అందుచేతనే **"అయమాత్మా బ్రహ్మ" "అహం బ్రహ్మాస్మి"** అనే మహావాక్యాలు జీవాత్మా పరమాత్మా రెండూ ఒక్కటే అని చాటి చెబుతున్నాయి. కాబట్టి జీవునికన్న తెలుసుకోవలసిన పదార్ధము ఇంకొకటి లేదు. అదే పరబ్రహ్మ స్వరూపము, ఆత్మస్వరూపము.

కర్మల ద్వారా అంటే యజ్ఞయాగాదులవ్ల గాని, ఇష్టాపూర్త కర్మలద్వారా గాని పుణ్యలోకాలు వస్తాయి. సాధకుడు స్వర్గసుఖాలు అనుభవించిన తరువాత కర్మఫలాన్ని అనుభవించటానికి ఉత్తర జన్మలు ఎత్తుతాడు. మళ్ళీ కర్మలు చేస్తాడు. స్వర్గసుఖాలు అనుభవించి మళ్ళీ జన్మిస్తాడు. ఈ రకంగా గానుగకు కట్టిన ఎద్దులాగా సంసారమనే బండిచక్రంలో పడి గిరగిర తిరుగుతూ ఉంటాడు. అయితే ఈ సుఖాలు అన్నీ క్షణికమైనవి. శాశ్వతమైన సుఖము ఆనందము. బ్రహ్మానందము ఒక్కటే. అది మోక్షం ద్వారానే కలుగుతుంది. అందుకే బ్రహ్మజిజ్ఞాస చేయాలి అంటే బ్రహ్మను గురించి తెలుసుకోవాలి.

వేదాధ్యయనం చెయ్యటం వల్ల గాని, కర్మలు చెయ్యటంవల్ల గాని, తర్కమువల్ల గాని, శాస్త్రపాండిత్యము వల్లగాని బ్రహ్మమును గురించి తెలుసుకోలేము. **కేవలము జ్ఞానము వల్ల మాత్రమే బ్రహ్మను గురించి తెలుసుకోవటము జరుగుతుంది.** అందుచేతనే సాధన చతుష్టయము పొందిన తరువాతనే బ్రహ్మజిజ్ఞాస కావాలి.

బ్రహ్మమనేది జ్ఞానప్రమాణాలవల్ల మాత్రమే తెలుసుకోదగ్గది. అంటే వేదాంతము అనగా ఉపనిషత్తుల విచారణద్వారా మాత్రమే బ్రహ్మము తెలుస్తుంది. చతుర్విధ పురుషార్థాలలో నాల్గవదైన మోక్షము బ్రహ్మసాక్షాత్కారమువల్లనే జరుగుతుంది. అందుకనే బ్రహ్మను గురించి తెలుసుకోవటానికి ప్రయత్నించాలి. అంటే బ్రహ్మజిజ్ఞాస కావాలి.

ఇక్కడ ఒక చిన్న అనుమానం వస్తుంది. బ్రహ్మము మనకు తెలిసినదా? తెలియనిదా? ఒకవేళ తెలిసినదే అయితే దాన్నిగురించి మళ్ళీ విచారణ చెయ్యవలసిన అవసరం లేదు. ఒకవేళ తెలియనిది అయితే దాన్ని విచారించి ప్రయోజనం లేదు. కాబట్టి బ్రహ్మజిజ్ఞాస ఉపయోగం లేనిదిగా కనిపిస్తుంది?" అయితే

“బ్రహ్మము ప్రసిద్ధమే. అది నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్త స్వభావం కలది. సర్వశక్తి సంపన్నమైనది. పైగా అది అందరికీ ఆత్మ. అందుచేత అందరికీ తెలిసినదే. ఆత్మ ఉన్నదని అందరూ నమ్ముతారు కదా! కాబట్టి ఆత్మయొక్క అస్తిత్వము ప్రసిద్ధమే. అదే బ్రహ్మము” అన్నాడు వ్యాసుడు.

ఇప్పుడు మళ్ళీ ఇంకో ప్రశ్న. ఆత్మ అనేదే బ్రహ్మము అన్నారు. దీన్ని గురించి అందరికీ తెలుసును అన్నారు. మరి అందరికీ తెలిసినదాన్ని గురించి మళ్ళీ విచారించాల్సిన అవసరం ఏమిటి?”

దీనికి సమాధానం చూడండి. బ్రహ్మము ప్రసిద్ధమైనదే అంటే అందరూ ఎరిగినదే. బ్రహ్మాన్ని గురించిన సామాన్యజ్ఞానము అందరికీ ఉన్నది. కాని దాని విశేషజ్ఞానం మీద అనేక వాదోపవాదాలున్నాయి. అందుచేతనే బ్రహ్మను గురించి తెలుసుకునే ప్రయత్నం చెయ్యాలి. దేహమే ఆత్మ అని నాస్తికులు, చార్వాకులు అంటారు. కాదు చేతనంగా కనుపించే ఇంద్రియాలే ఆత్మ అని కొందరంటారు. ఇంద్రియాలను ప్రేరేపించే మనస్సే ఆత్మ అని, కాదు విజ్ఞానము (బుద్ధి) ఆత్మ అని, కాదు దేహము, ఇంద్రియాలకన్న వేరైన వాడొకడున్నాడు. అతడే ఆత్మ అని, ఆత్మ అనేది కేవలము భోక్తయే తప్ప కర్తకాదు అని, ఈ రకంగా అనేకమంది ఆత్మనుగురించి అనేక విధాలుగా చెబుతుంటారు. ఇవన్నీ నిజంకాదు. వీరి వాదనలన్నీ సత్యంగానే ఉన్నట్టు అనిపిస్తాయి. కాని ప్రమాణాలు కావు.

ఈ స్థితిలో సామాన్య మానవులు ఎవరికి తోచిన విధంగా వారు ఆత్మను ప్రతిపాదించుకుంటారు.

మనకు వేదశాస్త్రాలే ప్రమాణం. ఈ జగత్తు అంతా మిథ్య. అంటే ఇవాళ్ళ ఉండేది రేపు ఉండనిది. పుట్టిన ప్రతిమనిషి గిట్టక మానడు. జీవితం దుఃఖ భూయిష్టం. సంసారిక దుఃఖాల నుండి నివృత్తి కావాలి. ఇది అందరూ కోరేదే. అంటే మరణము ఉండకూడదు. జననం లేకపోతే మరణం ఉండదు. అందుకే జన్మరాహిత్యం కావాలి. ఇదే మోక్షం. మోక్షము ఒక్కటే ఈ దుఃఖాల నుంచి రక్షించి మానవుడికి శాశ్వత ఆనందాన్ని ఇస్తుంది.

పరబ్రహ్మ సాక్షాత్కారమే మోక్షము. ఇది జ్ఞానంవల్లనే వస్తుంది. **‘జ్ఞానాదేవతు కైవల్యం’** కాబట్టి మోక్షసాధనమైన బ్రహ్మాన్ని గురించి తెలుసుకోవాలి. అందుకే ఈ బ్రహ్మజిజ్ఞాస.

చేరి, అక్కడ నుండి బ్రహ్మలోకం చేరతాడు. అని చెప్పబడింది. కాబట్టి వాయులోకము ఆదిత్య లోకానికి ముందు, సంవత్సర లోకం తరువాత ఉంటుంది.

## 184. విద్యుద్దేవత తరువాత జీవుడు వరుణలోకం చేరతాడు

ఈ విషయం మూడవదైన **వరుణాధికరణము**లో చెప్పబడింది. ఇందులో ఒక సూత్రం ఉంది.

***సూత్రం - 520 "తడితోధి వరుణః సంబన్ధాత్"***

**కౌశీతకీ ఉపనిషత్తు**లో, అర్చిరాది మార్గంలో వరుణలోకం ఉందన్నారుకదా! అది ఎక్కడ ఉన్నదో చెబుతున్నారు.

వరుణుడికి విద్యుత్తుతో సంబంధం ఉన్నది. కాబట్టి విద్యుల్లోకానికి పైన వరుణ లోకమున్నది.

విద్యుత్తు తరువాత వరుణుడికి స్థానముంటుంది. ఎందుచేతనంటే వరుణుడికి విద్యుత్తుతో, అంటే మెరుపుతో సంబంధమున్నది. అందుచేత విద్యుల్లోకానికి పైన వరుణలోకమున్నది.

## 185. అర్చిరాదులందరూ అతివాహిక దేవతలే

అర్చిరాది మార్గంలో ఉండే దేవతలంతా అతివాహక దేవతలేను అని వివరిస్తున్నారు నాల్గవదైన **అతివాహికాధికరణము**లో. ఇందులో మూడు సూత్రాలున్నాయి.

***సూత్రం - 521 "అతివాహికాస్తల్లిఙ్గాత్"***

***సూత్రం - 522 "ఉభయవ్యామోహాత్తత్సిద్ధేః"***

***సూత్రం - 523 "వైద్యుతేనైవ తతస్తచ్ఛ్రుతేః"***

అర్చిరాది మార్గంలో అనేకమైన లోకాలను వరుసగా చెప్పారుకదా. ఇవన్నీ గుర్తు కోసమా? త్రోవలో విశ్రాంతి తీసుకోవటానికి స్థానాలా? లేక ఉపాసకుని బ్రహ్మలోకానికి తీసుకుపోయే దేవతలా?

బ్రహ్మలోకానికి ప్రయాణమయ్యే వాడికి ఇవన్నీ అతివాహికలు. ఈ అర్చిరాదులన్నీ ఉపాసకుణ్ణి వెంట పెట్టుకుని బ్రహ్మలోకానికి తీసుకువెడతాయి. "విద్యులోకము నుంచి దివ్యపురుషుడొకడు బ్రహ్మలోకానికి తీసుకొని వెడతాడు."

ఈ రకంగా ప్రతిలోకంలోను ఆయా దేవతలు ఉపాసకుని జాగ్రత్తగా తరువాత లోకానికి చేరుస్తారు. కాబట్టి వారంతా అతివాహికలే.

ఉపాసకుడు వెళ్ళే మార్గాలన్నీ జడాలు. అచేతనాలు. అందుచేత అవి వ్యామోహితాలు. జడాలు కాబట్టి వాటికి సంకల్పం ఉండదు. ఉపాసకుణ్ణి భరించే సామర్థ్యం ఉండదు. ఉపాసకుడు శరీరహీనుడు. అతడికి మార్గజ్ఞానం ఉండదు. కాబట్టి బ్రహ్మలోకం చేరలేడు. అందుకని ఆయా లోకాలలోని దేవతలు అతణ్ణి తరువాత లోకానికి మోసుకొని పోతారు.

ఈ దేవతలు అన్ని కాలాలయందు, అన్ని సమయాలయందు ఉంటారు. ఉత్తరాయణం, దక్షిణాయణం, రాత్రి, పగలు, ఎప్పుడైనా వారుంటారు. కాబట్టి ఉపాసకుడు బ్రహ్మలోకం చేరటానికి ఆటంకం ఏమీ ఉండదు.

విద్యులోకం తరువాత ఒక పురుషుడు ఉపాసకుణ్ణి బ్రహ్మలోకం చేరుస్తాడు. ఆ విధంగా ప్రతిలోకం నుండి దివ్యపురుషుడు ఉపాసకుణ్ణి ఇంకొక లోకం చేరుస్తూ ఉంటారు. ఆ రకంగా ఉపాసకుడు బ్రహ్మలోకం చేరతాడు. ఈ లోకాలలోని దేవతలంతా అతివాహికలే.

## 186. దేవయానం ద్వారా సగుణ బ్రహ్మను పొందుతారు

ఈ విషయం ఐదవదయిన **కార్యాధికరణము**లో చెబుతున్నారు. ఇందులో ఎనిమిది సూత్రాలున్నాయి.

***సూత్రం – 524 "కార్యం బాదరిరస్య గత్యుపపత్తేః"***

***525 "విశేషితత్వాచ్చ"***

***526 "సామీప్యాత్తు తద్వ్యపదేశః"***

***527 "కార్యాత్యయే తదధ్యక్షేణ సహాతః పరమభిధానాత్"***

***528 "స్మృతేశ్చ"***

***529 "పరం జైమినిర్ముఖ్యత్వాత్"***

***530 "దర్శనాచ్చ"***

***531 "న చ కార్యే ప్రతిపత్త్యభిసన్ధిః"***

దేవయానం ద్వారా ఉపాసకుడు బ్రహ్మలోకం చేర్చబడతాడు. అని చెప్పారు. అక్కడ బ్రహ్మ అంటే పరబ్రహ్మ లేక కార్యబ్రహ్మ. (కార్యబ్రహ్మ అంటే సాకారబ్రహ్మ)

దేవయానం ద్వారా వెళ్ళిన ఉపాసకుడు ముందుగా కార్యబ్రహ్మను చేరతాడు. కార్యబ్రహ్మ అంటే సాకార బ్రహ్మ. పరబ్రహ్మ సర్వాంతర్యామి. అందుచేత ఉపాసకుడు ముందుగా సగుణబ్రహ్మ అంటే కార్యబ్రహ్మను చేరతాడు.

ఇంకొక శ్రుతిలో కూడా ముందుగా సగుణ బ్రహ్మను చేరతాడు అని చెప్పబడింది. కాబట్టి బ్రహ్మలోకము అంటే కార్యబ్రహ్మమే అని గుర్తించాలి.

పరబ్రహ్మకు అతి సమీపంగా ఉంటాడు కార్యబ్రహ్మ. అతడే అపరబ్రహ్మ కాబట్టి అపరబ్రహ్మను కూడా బ్రహ్మమనే అంటాడు.

ఉపాసన కోసము మనోమయత్వాది గుణాలతో కూడినదిగా చెప్పబడే నిర్వికార బ్రహ్మమే కార్యబ్రహ్మము. అందుచేతనే సగుణబ్రహ్మను కూడా బ్రహ్మమనే అంటారు. అద్దంలో కనుపించేది ప్రతిబింబమే అయినా దాన్ని కూడా ముఖము అనే అంటాము. అలాగే కార్యబ్రహ్మ కూడా పరబ్రహ్మ లాంటివాడే.

కార్యబ్రహ్మకు ప్రళయం సంభవించినప్పుడు అంటే కల్పాంతమునందు, బ్రహ్మ యొక్క ఆయుర్దాయము పూర్తి అయిన తరువాత, ఈ కార్యబ్రహ్మ, పరబ్రహ్మలో లీనమవుతాడు. బ్రహ్మతోపాటే బ్రహ్మలోకం చేరిన జ్ఞానులు కూడా పరబ్రహ్మలో లీనమవుతారు. ఇదే క్రమముక్తి.

**ఉపాసకుడు ఏ దేవతను పరబ్రహ్మగా ఉపాసిస్తున్నాడో అతడే కార్యబ్రహ్మ. వైష్ణవులకు – విష్ణువు, శైవులకు – ఈశ్వరుడు. శాక్తేయులకు – అమ్మవారు కార్యబ్రహ్మ అవుతారు. అందుకే మరణానంతరము ఉపాసకుడు వైకుంఠము, కైలాసము, మణిద్వీపము మొదలైనవి చేరతాడు.**

బ్రహ్మలోకం చేరినవారు కల్పాంతం వరకు బ్రహ్మలోకంలో, బ్రహ్మవద్దనే ఉండి, కల్పాంతాన కార్యబ్రహ్మతో కలిసి పరబ్రహ్మలో లీనమవుతారు.

బ్రహ్మశబ్దానికి ముఖ్యమైన ఆలంబనం పరబ్రహ్మే కాబట్టి ఇక్కడ గతి పరబ్రహ్మే అని జైమిని ఉద్దేశ్యం.

బ్రహ్మనాడీ మార్గాన వెళ్ళినవారు ముక్తిని అంటే అమృతత్వాన్ని పొందుతారు. అని వేదం చెబుతోంది. అమృతత్వమనేది పరబ్రహ్మ వల్లనే సంభవం. కార్యబ్రహ్మకు అమృతత్వాన్నిచ్చే శక్తి లేదు. కాబట్టి ఇక్కడ బ్రహ్మ అంటే పరబ్రహ్మే అని గుర్తించాలి.

ఉపాసకులకు బ్రహ్మలోకమే ప్రాప్తి. అంటే ఇక్కడ కార్యబ్రహ్మమే కాదు. పరబ్రహ్మమే అని అర్ధము. **సగుణోపాసకులకు కార్యబ్రహ్మ, నిర్గుణోపాసకులకు పరబ్రహ్మ.**

## 187. అప్రతీకోపాసకులు బ్రహ్మలోకం చేరతారు

నిర్గుణబ్రహ్మను ఉపాసించేవారు మాత్రమే బ్రహ్మలోకం చేరతారు అని ఆరవదైన **అప్రతీకాలంబనాధికరణము**లో వివరిస్తున్నారు. ఇందులో రెండు సూత్రాలున్నాయి.

***సూత్రం - 532 "అప్రతీకాలమ్బనాన్నయతీతి బాదరాయణ ఉభయథాఽ దోషాత్తత్క్రతుశ్చ"***

***533 "విశేషం చ దర్శయతి"***

ఉపాసకులంతా బ్రహ్మలోకం చేరతారా? లేక వారిలో కొందరు మాత్రమే వెడతారా? దివ్యపురుషులు అందరినీ బ్రహ్మలోకానికి తీసుకుపోతారా?

జ్ఞానులైన వారిని ఆ దివ్యపురుషుడు బ్రహ్మలోకం చేరుస్తాడు. అని వ్యాసుని అభిప్రాయము. ఎవరు ఏ ఉపాసన చేస్తే, ఆ ఫలం పొందుతారు. అందుచేత ఉపాసకులు బ్రహ్మలోకం చేరతారు.

పంచాగ్నివిద్య, దహరవిద్య, పర్యంతకవిద్య, వైశ్వానరవిద్య మొదలైనవి ఉపాసించేవారు బ్రహ్మలోకం చేరతారు. ప్రతీకోపాసకులు కాకుండా మిగిలిన వారంతా బ్రహ్మోపాసకులే. వారు బ్రహ్మలోకం చేరటంలో సందేహం లేదు. ప్రతీకోపాసనలో బ్రహ్మోపాసన లేదు. అందుకనే ప్రతీకోపాసకులకు బ్రహ్మలోక ప్రాప్తిలేదు. వీరు నామము, వాక్కు, మనస్సు మొ॥ వాటిని ఉపాసిస్తారు.

ప్రతీకోపాసకులు బ్రహ్మలోకానికి పోరు. నామాన్ని బ్రహ్మగా ఉపాసించే వారు నామం ప్రసరించినంత వరకు స్వేచ్ఛగా విహరిస్తారు. మనస్సు, వాక్కు మొదలైన వాటిని ఉపాసన చేసినవారు అవి వ్యాపించి ఉన్నంతవరకు స్వేచ్ఛగా సంచరించ గలుగుతారు.

అందుచేత ప్రతీకోపాసకులకు బ్రహ్మలోక ప్రాప్తి లేదు. అప్రతీకోపాసకులు అంటే బ్రహ్మోపాసకులు మాత్రమే బ్రహ్మలోకం పొందుతారు.

***దీంతో బ్రహ్మసూత్రాలలోని నాల్గవ అధ్యాయంలో మూడవపాదం పూర్తయింది.***

# నాల్గవ అధ్యాయం

## నాల్గవ పాదం

ఈ పాదంలో బ్రహ్మవేత్తలకు కలిగే సాక్షాన్ముక్తి, సగుణోపాసకులకు కలిగే బ్రహ్మసమాన ఐశ్వర్యము వివరిస్తున్నారు. ఇందులో ఏడు అధికరణలు, ఇరవై రెండు సూత్రాలున్నాయి.

## 188. ముక్తపురుషుడు స్వస్వరూపంలో ఉంటాడు

ఈ విషయాన్ని మొదటిదైన **సంపద్యావిర్భావాధికరణ**లో వివరిస్తున్నారు. ఇందులో మూడు సూత్రాలున్నాయి.

***సూత్రం - 534 "సంపద్యావిర్భావః స్వేన శబ్దాత్"***

***535 "ముక్తః ప్రతిజ్ఞానాత్"***

***536 "ఆత్మా ప్రకరణాత్"***

జీవుడు శరీరం నుండి లేచి అంటే శరీరాన్ని, వదిలి పరబ్రహ్మను పొంది స్వరూపంతో నిలుస్తున్నాడు. అవి **ఛాందోగ్యోపనిషత్తు** చెబుతోంది. ఇందులో చెప్పిన ముక్తి అనేది స్వర్గము లాగా ఉంటుందా? స్వర్గము పొందినవాడు సుఖాలనుభవించి, ఉత్తరజన్మలు ఎత్తుతాడు. అలాగే ఈ ముక్తుడు కూడా ఏదైనా అధిఖ్యాన్ని పొందుతాడా? లేక స్వస్వరూపంతోనే ఉంటాడా?

ప్రకాశ రూపమైన ఆత్మసాక్షాత్కారాన్ని పొంది, ఆ ఆత్మరూపంలో విద్వాంసుడు ఆవిర్భూతుడౌతాడు. జీవుడు తానైన రూపంలో ఉండటమే ముక్తి. అదే స్వరూప స్థితి. అజ్ఞానం వదిలిపోగానే స్వస్వరూపం తెలుస్తుంది. కాబట్టి ముక్తి అనేది పుట్టదు.

ముక్తి పొందిన పురుషుడు పూర్ణానందస్వరూపంలో ఉండిపోతాడు. సంసార దశలో అవిద్యతో బంధించబడిన ఆత్మ జ్ఞానం కలిగిన తరువాత శుద్ధుడు, ముక్తుడు అవుతున్నాడు. శరీరం లేనటువంటి ఆత్మకు ప్రియము, అప్రియము ఉండవు.

ప్రకరణాన్ని బట్టి జ్యోతి అంటే 'ఆత్మ' అని అర్థం. అంతేకాని వెలుగుకాదు. ఇది ఆత్మను గురించి చెప్పే ప్రకరణము. అందుకని ఇక్కడ జ్యోతి అంటే ఆత్మ అనే అర్థం. "దానిని దేవతలు జ్యోతికి జ్యోతిగా చూస్తారు" అని చెప్పబడింది. కాబట్టి ముక్తపురుషుడు స్వస్వరూపంలో అంటే ఆత్మరూపంలోనే ఉంటాడు.

## 189. ముక్తుడికి పరబ్రహ్మకు తేడాలేదు

ముక్తి పొందినవాడు తానుకూడా సాక్షాత్తూ పరబ్రహ్మే అవుతాడు అని వివరిస్తున్నారు రెండవదైన **అవిభాగేనదృష్టత్వాధికరణము**లో ఇందులో ఒక సూత్రమే ఉంది.

***సూత్రం - 537 "అవిభాగేన దృష్టత్వాత్"***

ముక్తపురుషుడు పరమాత్మకన్న భిన్నమైన రూపంలో ఉంటాడా? ఏకరూపంలోనే ఉంటాడా?

ముక్తస్వరూపుడు బ్రహ్మతో అవిభక్తమైన రూపంలో ఉంటాడు. బ్రహ్మకు, అతడికీ తేడా ఉండదు. తాను బ్రహ్మ అయి ఆ పరబ్రహ్మనే పొందుతాడు. వేదం ముక్తపురుషుడికి, బ్రహ్మకు భేదం లేదు అని చెబుతోంది. ముక్తపురుషుడు విడదీయటానికి వీలులేని విధంగా నిరతిశయానంద స్వరూపంగా ఉంటాడు. ముక్తపురుషుడు పరమాత్మే.

## 190. ముక్తాత్ముని లక్షణాలు

ముక్తుడైనవాడు ఎలా ఉంటాడో వివరిస్తున్నారు. మూడవదైన **బ్రహ్మాధికరణము**లో. ఇందులో మూడు సూత్రాలున్నాయి.

***సూత్రం - 538 "బ్రాహ్మేణ జైమినిరుపన్యాసాదిభ్యః"***

***539 "చితి తన్మాత్రేణ తదాత్మకత్వాది త్యౌడులోమిః"***

***540 "ఏవమప్యుపన్యాసాత్పూర్వభా వాద విరోధం బాదరాయణః"***

ముక్తపురుషుడు సత్యసంకల్ప, సర్వజ్ఞత్వాది లక్షణాలు కలవాడై ఉంటాడా? అతడి లక్షణాలేమిటి?

**జైమిని అభిప్రాయం** ప్రకారం సర్వజ్ఞత, సర్వేశ్వరత్వము, అనే లక్షణాలు కలిగి ఉంటాడు ముక్తపురుషుడు. **ఛాందోగ్యోపనిషత్తు**లో చెప్పినట్లుగా ఆత్మపాపరహితుడు, ముసలితనము, చావు, శోకము, ఆకలి, దప్పిక లేనివాడు. సత్యకాముడు, సత్యసంకల్పుడు.

జీవుడు చైతన్య స్వరూపుడు కాబట్టి ముక్తపురుషుడు కూడా చైతన్యరూపంలోనే ఉంటాడని 'ఔడులోమి' అభిప్రాయం.

**తైత్తిరీయోపనిషత్తు**లో సత్యము జ్ఞానము అనంతమయినది పరబ్రహ్మ అని చెప్పబడింది. **బృహదారణ్యకోపనిషత్తు**లో ఆత్మబాహ్యాభ్యంతరాలు లేనిది. సంపూర్ణమైనది. ప్రజ్ఞాన ఘనమైనది ఆత్మజ్ఞానికి శోకము, మోహము, దుఃఖము ఉండవు. బ్రహ్మచైతన్య రూపుడు అన్నాడు. అందుచేతనే బ్రహ్మను పొందే ముక్తపురుషుడు కూడా చైతన్యరూపుడే అయి ఉంటాడు. ఇది **ఔడులోమి అభిప్రాయం.**

ముక్తుడు చైతన్య స్వరూపుడు అని చెప్పినప్పటికీ, బ్రహ్మకుండే సత్యసంకల్పం, సర్వజ్ఞత మొదలైన గుణాలు ముక్తుని యందు కూడా సంభవిస్తాయి అంటాడు **వ్యాసమహర్షి.** కాబట్టి ఈ రకంగా పరబ్రహ్మకుండే లక్షణాలన్నీ ముక్తునికి కూడా ఉంటాయి.

## 191. ముక్తాత్ముని కోరికలు వెంటనే సిద్ధిస్తాయి

జ్ఞానియైనవాడు కోరినంతనే దేవతలు ప్రత్యక్షమవుతారు. అతని కోరికలు సిద్ధిస్తాయి అని నాల్గవదైన **సంకల్పాధికరణము**లో వివరిస్తున్నారు. ఇందులో రెండు సూత్రాలున్నాయి.

***సూత్రం - 541 "సంకల్పాదేవ తు తచ్ఛ్రుతేః"***

***542 "అత ఏవ చానన్యాధిపతిః"***

అర్చిరాదిమార్గాన బ్రహ్మలోకం చేరిన ఉపాసకుడికి, భోగ్యవస్తువుల్ని సృష్టించటం అనేది సంకల్ప మాత్రం చేత సాధ్యమా? లేక ప్రయత్నంచేత సాధ్యమా? అనే విషయాన్ని వివరిస్తున్నారు.

జ్ఞానియైనవాడు కోరినంతనే అంటే సంకల్పమాత్రం చేతనే పితృదేవతలు మొదలైన వారు ప్రత్యక్షమవుతారు.

**ఛాందోగ్యోపనిషత్తు**లో చెప్పినట్లుగా "త్రానే బ్రహ్మ" అని తెలుసుకున్నవాడు. సమస్త లోకాల్లోనూ విహరించగలుగుతాడు.

సత్యకాముడై దహరాకాశంలో బ్రహ్మను సేవించినవాడు మరణానంతరము పితృలోకాన్ని కోరితే పితృగణం ప్రత్యక్షమవుతుంది. వారితో పితృలోకాలకు పోయి పితృలోక అనుభవాలతో సంపన్నుడై మహిమాన్వితుడౌతాడు.

అతడు మాతృలోకాలు కోరితే, మాతృగణాలతో మాతృలోకాలకు పోయి అక్కడి సుఖాలనుభవిస్తాడు.

భ్రాతృలోకాలు కోరితే, భ్రాతృగణాలతో భ్రాతృ లోకాలకు పోయి అక్కడి సుఖం అనుభవిస్తాడు.

భగినీలోకాలు (సోదరి) కోరితే భగినీ లోకాలకు పోయి సుఖిస్తాడు.

మిత్రలోకాలు కోరితే, మిత్రులంతా ప్రత్యక్షమవుతారు. వారితో ఆ లోకాలు పోయి సుఖిస్తాడు.

గంధమాల్య లోకాలు (పూలదండలు, సుగంధ ద్రవ్యాలు పుష్కలంగా గల లోకం) కోరితే ఆ లోకవాసులు ప్రత్యక్షమవుతారు. వారితో కలిసి ఆ లోకంలో సుఖిస్తాడు.

అన్నపాన లోకాలు కోరితే ఆ లోకవాసులు ప్రత్యక్షమవుతారు. వారితో కలసి ఆ లోకంలో సుఖిస్తాడు.

గీతావాద్య సంబంధమైన లోకాలు కోరితే ఆ లోకవాసులు ప్రత్యక్షమవుతారు. వారితో కలసి అక్కడ సుఖాలను అనుభవిస్తాడు.

స్త్రీలోకాన్ని కోరితే ఆ లోకవాసులైన స్త్రీలు ప్రత్యక్షమవుతారు. వారితో కలసి ఆ లోకంలో సుఖిస్తాడు.

ఈ రకంగా అతడు ఏ లోకాలు కోరితే ఆలోకవాసులు ప్రత్యక్షమవుతారు. వారితో కలిసి ఆ లోకాలలో సుఖిస్తాడు. అంటూ అతడు సమస్త లోకాలు చేరగలుగుతాడని చెప్పబడింది. కాబట్టి జ్ఞాని సంకల్పమాత్రం చేతనే సర్వమూ పొందగలుగుతాడు.

ఇటువంటి తిరుగులేని సంకల్పంవల్లనే విద్వాంసుడు అనన్యాధిపతి అవుతున్నాడు. అతడికి వేరొక ప్రభువు అంటూ ఎవరూ ఉండరు. అతడికి చక్రవర్తి లాగా అన్ని లోకాలలోనూ సంచారముంటుంది. అతడు కోరినంత మాత్రంచేతనే అన్ని లోకాలు పొందగలుగుతాడు.

## 192. ముక్తాత్ములకు శరీరం ఉంటుందా?

ముక్తి పొందిన వారికి శరీరం ఉంటుందా అనే విషయాన్ని ఐదవదైన **అభావాధికరణ**లో వివరిస్తున్నారు. ఇందులో ఐదు సూత్రాలున్నాయి.

***సూత్రం - 543 "అభావం బాదరిరాహ హ్యేవమ్"***

***544 "భావం జైమినిర్వికల్పామననాత్"***

***545 "ద్వాదశాహవదుభయవిధం బాదరాయణో-తః"***

***546 "తన్వభావే సంధ్యవదుపపత్తేః"***

***547 "భావే జాగ్రద్వత్"***

ముక్తపురుషులు సంకల్ప మాత్రం చేతనే, కోరిన లోకాలు పొందుతారు అన్నారు. సంకల్పం ఉందన్నారు. సంకల్పం కావాలంటే మనస్సు కావాలి. అంటే ముక్తపురుషుడికి మనస్సు, ఇంద్రియాలు అన్నీ ఉంటాయా?

విద్వాంసుడు అంటే జ్ఞానియైన వాడికి మరణానంతరము శరీరముండదు.

ముక్తపురుషుడికి ఇంద్రియాలు శరీరము ఉండవు అంటాడు వ్యాసుడు. విద్వాంసుడికి మనస్సుకన్న భిన్నమైన శరీరము, ఇంద్రియాలు ఏవీ బ్రహ్మలోకంలో లేవు.

జైమిని అభిప్రాయం ప్రకారం ముక్తపురుషుడికి శరీరాదులున్నాయి.

ఇక్కడ రెండు విధాలైన శ్రుతులు కనిపిస్తున్నాయి. బ్రహ్మలోకాన్ని పొందినవారు స్వతంత్రులు. వారి సంకల్పం తిరుగులేనిది. అందుచేత శరీరం కావాలనుకుంటే శరీరం ధరిస్తారు. అక్కరలేదు అనుకుంటే శరీరం ఉండదు. అని వ్యాసుడు అంటున్నాడు.

ముక్తులు రెండు రకాలు 1. జీవన్ముక్తులు 2. విదేహముక్తులు. వీరిలో జీవన్ముక్తులకు శరీరం ఉంటుంది. విదేహ ముక్తులకు శరీరం ఉండదు. ఒకవేళ విదేహముక్తులు కూడా పరమాత్మలో లీనం కాకుండా శరీరాన్ని ధరిస్తే, ఆ శరీరంతో చేసే పాపపుణ్యాలు వారే అనుభవించాలి. ఉదా : నారదుడి శాపంవల్లనే శ్రీమహావిష్ణువు శ్రీరాముడిగా జన్మించాడు.

బ్రహ్మలోకంలో ఇంద్రియాలతో కూడిన దేహం లేకపోయినప్పటికీ, స్వప్నంలో లాగా మానసికంగా విషయాలు పొందుతారు.

స్వప్నంలో అనేక విషయలు చూస్తాము. పదార్థాలు తింటాము. భోగాలు అనుభవిస్తాము. కాని శరీరము ఇంద్రియాలు ఏవీ ఉండవు.

అవన్నీ స్వప్నంలో యధార్థమే. అలాగే బ్రహ్మలోకంలో భోగాలు మనసు ద్వారానే అనుభవిస్తారు. ఈ విషయం **కౌషీతకీ బ్రాహ్మణం**లోని అర్చిరాదిమార్గంలో చెప్పబడింది.

శరీరం ఉన్నప్పుడు జాగ్రదావస్థలో లాగా అనుభవిస్తాడు. శరీరం లేనప్పుడు మనసుతో అనుభవిస్తాడు. కాబట్టి ముక్తపురుషునికి శరీరం ఉండటం లేకపోవటం అనేది అతని సంకల్పం వల్లనే జరుగుతుంది.

## 193. ఒకే కాలంలో అనేక శరీరాలు

ముక్తుడు ఒకే కాలంలో అనేక శరీరాలు ధరించగలడు. అంటున్నారు ఆరవదైన **ప్రదీపాధికరణము**లో. ఇందులో రెండు సూత్రాలున్నాయి.

***సూత్రం - 548 "ప్రదీపవదావేశస్తథా హి దర్శయతి"***

***549 "స్వాప్యయసంపత్త్యోరన్యత రాపేక్షమావిష్కృతం"***

ముక్తుడు కావాలనుకుంటే ఒక శరీరమే పొందుతాడా? లేక ఒకే కాలంలో అనేక శరీరాలు పొందుతాడా?

విద్వాంసుని చేత నిర్మించబడిన అనేక శరీరాల్లో విద్వాంసుడు ప్రదీపంలాగా ఆవేసిస్తాడు.

ముక్తుడు ఆత్మభోగం కావాలనుకున్నప్పుడు అనేక శరీరాలు కలుగుతాయి. ఒకే ఆత్మ, ఒకే మనస్సుతో అనేక శరీరాల్లో భోగము అసంభవం. కాబట్టి అనేక ఆత్మలు, మనసులు కల్పించబడాలి. అలా జరుగుతుందా? అంటే జరగదు. కాని ప్రదీపం లాగా ఆవేసిస్తాడు. అంటే దీపం ఒకటే కాని వత్తులను అంటుకుని అనేక దీపాలవుతుంది. అలాగే ముక్తుడు, తానొక్కడే అయినా అనేక రూపాలు పొందుతాడు. అనేక శరీరాలను ఆవేశిస్తాడు.

ముక్తపురుషుడు తాను ఒకే కాలంలో అనేక శరీరాల్లో ప్రవేశించగలడు.

## 194. ముక్తుడు జగస్సృష్టి తప్ప అన్నీ చేయగలడు

ముక్తి పొందినవాడు ఒక్క సృష్టి కార్యక్రమం తప్ప మిగిలిన పనులన్నీ పరమేశ్వరుని లాగానే చేయగలడు అంటున్నారు ఏడవదైన **జగద్వ్యాపారాధి కరణము**లో. ఇందులో ఆరు సూత్రాలున్నాయి.

*సూత్రం – 550 "జగద్వ్యాపారవర్జం ప్రకరణాదసం నిహితత్వాచ్చ"*

*551 "ప్రత్యక్షోపదేశాదితి చేన్నాధికారిక మణ్డలస్థోక్తేః"*

*552 "వికారావర్తి చ తథా హి స్థితిమాహ"*

*553 "దర్శయతశ్చైవం ప్రత్యక్షానుమానే"*

*554 "భోగమాత్రసామ్యలిఙ్గాచ్చ"*

*555 "అనావృత్తిః శబ్దాదనావృత్తిః శబ్దాత్"*

ముక్తపురుషుడు సంకల్ప మాత్రంచేత జగత్తును సృష్టించగలడా?

విద్వాంసుడికి అణిమాది అష్టసిద్ధులన్నీ లభిస్తాయి. కాని జగత్తును సృష్టించే శక్తి మాత్రం ఉండదు. ఆ పని పరమేశ్వరుని వల్లనే జరుగుతుంది.

సృష్టి సమయంలో పరమేశ్వరుడు ఒక్కడే ఉంటాడు. అతనికి సన్నిహితులు గాని, అతనితో సమానమైన వారుగాని ఎవరూ ఉండరు.

విద్వాంసుడికి ఈశ్వరునితోపాటు సమానమైన ఐశ్వర్యం కలుగుతోంది. అంతమాత్రం చేత జగద్వ్యాపారము, జగత్కర్తృత్వము కలగవు. వీరంతా బ్రహ్మలోకంలోనే ఉంటారు. కాబట్టి వీరిశక్తి అక్కడి వరకే పరిమితము. వీరంతా పరబ్రహ్మకు లోబడే ఉంటారు. లోకాలను సృష్టించే అధికారం వీరికి లేదు.

పరమేశ్వరుని రూపం వికారమందు మాత్రమే ఉండేదికాదు. నిత్యమైనది కూడా. ఇది సగుణము, నిర్గుణము అని రెండు రకాలుగా ఉన్నది అని వేదంలో చెప్పబడింది.

ఈ వికారమంతా పరమేశ్వరుని వ్యాప్తి. ఆయన మాత్రం వికారానికి ఆవల ఉన్నాడు. నిర్వికారుడై ఉన్నాడు. ఈ సమస్త భూతాలు పరమేశ్వరునికి యొక్క ఒక పాదము మాత్రమే. మిగిలిన మూడు పాదాలు స్వర్గంలో ఉన్నాయి. ఈశ్వరుడికి సగుణ, నిర్గుణ రూపాలు రెండూ ఉన్నాయి. నిర్గుణ రూపాన్ని సగుణోపాసకులు పొందలేరు.

ప్రత్యక్షం అంటే వేదం. అనుమానం అంటే స్మృతి పురాణాలు.

జ్యోతి రూపుడైన పరబ్రహ్మ యందు లోకాలను ప్రకాశింపచేసే సూర్యుడు ప్రకాశింపడు. చంద్రుడు కాంతులివ్వడు. తారకలు ప్రకాశింపవు. అని ఉపనిషత్తులు చెబుతున్నాయి. ఇవి వేదంలో భాగాలు.

ఇదే విషయాన్ని పురాణాలు కూడా చెబుతున్నాయి. స్వయం ప్రకాశమానుడైన పరమాత్మను సూర్యచంద్రాగ్నులు ప్రకాశింపచేయలేవు అంటోంది భగవద్గీత.

పరమాత్మది తేజస్సులకన్నా అధికమైన తేజస్సు. కాబట్టి సగుణ, నిర్గుణరూపాలు రెండూ ఉన్నాయి.

ఉపాసకులకు ఈశ్వరునితోపాటుగా భోగమాత్రమైన సామ్యమే ఉన్నదని వేదాలు చెబుతున్నాయి. అందుచేత వారికి జగత్తును సృష్టించే శక్తి, అధికారము లేవు.

సమస్త ప్రాణులు హిరణ్యగర్భుని పూజించినట్లే ఉపాసకులను కూడా పూజిస్తాయి. అంటే హిరణ్యగర్భునికి మల్లేనే ఉపాసకునికి కూడా భోగసాధనాలవుతాయి.

బ్రహ్మలోకం చేరిన ఉపాసకులతో బ్రహ్మ "ఓ ఉపాసకులారా! ఇక్కడ అమృత రూపమైన భోగాలను నేను ఉపయోగిస్తున్నట్లే, మీరు కూడా ఉపయోగిస్తారు" అంటాడు. అంటే సగుణోపాసకులు బ్రహ్మలోకం చేరి, బ్రహ్మతో పాటే వీరు కూడా అక్కడ ఉన్న సమస్త భోగాలు అనుభవిస్తారు. వీరికి భోగసామ్యమే తప్ప జగద్వ్యాపారం లేదు.

అయితే ఇక్కడ చిన్న అనుమానం వస్తుంది. **'యోగవాసిష్టం'**లో ఋషి కుమారులు ఆరుగురు జగత్తును ఆరు రకాలుగా సృష్టించారు. అలాగే **త్రిపురా రహస్యం**లో 'తంగణపుత్రుడు' అనే ముని కుమారుడు ఒక కొండలో జగత్తును సృష్టించి దాన్ని మహారాజుకు చూపిస్తాడు. ఇలాటి సందర్భాలలో పరబ్రహ్మ కాకుండా ఇతరులు కూడా ఈ సృష్టి చేశారు కదా ! అని అనుమానం వస్తుంది.

సృష్టి అనేది రెండు రకాలుగా ఉంటుంది. 1.వ్యష్టి 2.సమిష్టి.

వ్యష్టి సృష్టిలో అతడు చేసిన సృష్టి అతడికి, మహా అయితే ఇంకా ఒకరిద్దరికీ మాత్రమే కనిపిస్తుంది. ఇది గారడీవాడు చేసే సృష్టి. పూర్వకాలంలో అంటే నా చిన్నప్పుడు 'విప్రతినోదివాళ్ళు' అనే యాచకులు వచ్చేవాళ్ళు. వాళ్ళు చేత్తో వేపాకు

తీసుకుని నేలమీద వేస్తే అది కాస్తా తేళ్ళుగా మారిపోయేది. మేమంతా చూసేవాళ్ళం. ఆ తరువాత ఆ తేళ్లను చేతులోకి తీసుకుని చిలకగా మార్చేసేవాడు. ఇదంతా కనికట్టు. గారడీవిద్య. ఈ రకమైన సృష్టి ఎక్కువసేపు నిలవదు. కలలాగా క్షణాల్లో కరిగిపోతుంది. విశ్వామిత్రుడు సృష్టించిన త్రిశంకుస్వర్గం కూడా ఇలాంటిదే.

2. సమిష్టి సృష్టి అనేది పరమేశ్వరుడు చేసేది. ఈ సృష్టి అందరికీ ఒకేలా కనిపిస్తుంది. ఇక్కడ పులి అందరికీ పులిలాగానే కనిపిస్తుంది. ఈ సృష్టి ఎక్కువ కాలం నిలుస్తుంది. ఇది బ్రహ్మ చేసే సృష్టి.

కాబట్టి గతంలో పరబ్రహ్మ తప్ప ఎవరైనా సృష్టి చేశారు అంటే అది వ్యష్టి సృష్టి. గారడీవిద్య లాంటిది. జగద్వ్యాపారము పరమేశ్వరుడి వల్లే జరుగుతుంది. అది కూడా సృష్టి చెయ్యాలంటే సగుణ బ్రహ్మకు మాత్రమే సాధ్యం. నిర్గుణబ్రహ్మ సృష్టి చెయ్యదు.

అర్చిరాది మార్గం గుండా బ్రహ్మలోకం చేరిన వారికి కూడా పునరావృత్తి లేదు.

**కఠోపనిషత్తు**లో చెప్పినట్లుగా బ్రహ్మనాడి గుండా పైకి పోయిన వారు అమృతత్త్వం పొందుతారు. **బృహదారణ్యకం**లో చెప్పినట్లుగా దేవయానం ద్వారా పోయేవారు మానవలోకానికి తిరిగిరారు. అంటే నిరాకారాన్ని ఉపాసించిన వారు వెంటనే అమృతత్త్వం పొందుతారు. కాని సాకారోపాసన చేసినవారు దేవయానం ద్వారా పైకి పోయి, కల్పాంతం వరకు బ్రహ్మలోకం ఉండి, కల్పాంతాన పరబ్రహ్మలో లీనమవుతారు. వీరికి మరుజన్మ లేదు.

మొత్తం మీద సాకారోపాసన గాని నిరాకారోపాసన గాని చేసిన వారందరూ పరబ్రహ్మలో లీనమవుతారు. వీరికి మరుజన్మ లేదు ముక్తుడు జగసృష్టి తప్ప అన్నీ చేయగలడు అని చెబుతున్నాయి బ్రహ్మసూత్రాలు.

ఈ సూత్రంలో **"అనావృత్తిః శబ్దాదనావృత్తిః శబ్దాత్"** పునరావృత్తి లేదు పునరావృత్తి లేదు అని రెండుసార్లు చెబుతున్నారు. అంటే బ్రహ్మలోకం చేరినవారు తిరిగి జన్మించరు అంటూ ఈ గ్రంథం ఇక్కడితో పూర్తయిందని చెబుతున్నాడు వ్యాసభగవానుడు.

# 195. బ్రహ్మసూత్రాలలో ప్రాచీన ఋషులు

వ్యాసమహర్షి బ్రహ్మసూత్రాలు వ్రాస్తూ తనకు పూర్వకాలంలో ఉన్న ఋషులు కొందరిని చెప్పటం జరిగింది. అంటే వ్యాసుడికన్న ముందు కాలంలోనే కొంతమంది బ్రహ్మసూత్రాలు వ్రాశారనే విషయం మనకి తెలుస్తోంది. వీరిలో మొదటివాడు

**1. ఆత్రేయుడు :** బ్రహ్మసూత్రాలలో 3వ పాదంలోని 4వ అధికరణలోని 44వ సూత్రంలో

ఉపాసన కర్మలు యజమానే చెయ్యాలి. అప్పుడే ఆ ఫలితం యజమానికి చెందుతుంది. ఆ కర్మలు ఋత్విక్కులతో చేయించరాదు. అలా చేస్తే ఫలితము యజమానికి రాదు అని చెప్పాడు ఆత్రేయుడు. ఆత్రేయుని సిద్ధాంతాన్ని ఖండించి ఋత్విక్కుకు దక్షిణ ఇస్తాం కాబట్టి, ఉపాసన ఫలితం యజమానికే దక్కుతుంది. అని తీర్మానించాడు వ్యాసుడు.

**2. అశ్మరథ్యుడు :** మొదటి అధ్యాయం 4వ పాదంలోని 20వ సూత్రంలో జీవాత్మలు నిప్పునుంచి వచ్చే రవ్వల వంటి వారు అని చెప్పాడు.

**3. ఔఢులోమి :** ఈయన 1.4.21, 3.4.45, 4.4.6 సూత్రాలలో చెప్పబడ్డాడు. వీరి సిద్ధా:తం ప్రకారం సంసార జీవితంలో జీవాత్మ-పరమాత్మలకు భేదమున్నది. కాని ముక్తిపొందే సమయంలో జీవాత్మ పరమాత్మల మధ్య భేదం లేదు.

**4. కార్ష్ణాజిని :** మూడవ అధ్యాయం మొదటి పాదంలోని తొమ్మిదవ సూత్రంలో ఈయన పేరు కనిపిస్తుంది. జీవులు తాము చేసిన కర్మల ననుసరించి మరుజన్మ పొందుతారు అనేది వీరి సిద్ధాంతం. దీన్ని వ్యాసుడు కూడా ఒప్పుకున్నాడు.

**5. కాశకృత్స్నుడు :** మొదటి అధ్యాయం నాల్గవ పాదంలోని ఇరవై రెండవ సూత్రంలో ఈయన పేరు కనిపిస్తుంది.

జీవాత్మ, పరమాత్మ వేరు కాదు రెండూ ఒకటే. అనేది వీరి సిద్ధాంతం.

**6. జైమిని :** వ్యాసుని శిష్యుడు. పూర్వమీమాంస (కర్మ సిద్ధాంతం) వ్రాసినవాడు. బ్రహ్మసూత్రాలలో ఇతని పేరు 11సార్లు కనిపిస్తుంది. ఒకటి రెండు చోట్ల వ్యాసునితో ఏకీభవించలేదు.

**7. బాదరాయణుడు :** బాదరాయణుడు అంటే వ్యాసుడే. కాని కొన్ని విషయాలు ఖచ్చితంగా చెప్పటానికి 'బాదరాయణుడు ఇలా అంటున్నాడు' అన్నాడు వ్యాసుడు.

**8. బాదరి :** ఇతడు మొత్తం నాలుగుచోట్ల కనిపిస్తాడు. శుద్ధబ్రహ్మవాది అయిన అద్వైతాచార్యుడు. పరమేశ్వరుడు సర్వవ్యాపి. జీవుల హృదయంలో ఉంటాడు కాబట్టి 'ప్రాదేశమాత్రుడే' అనబడతాడు. **శూద్రులకు కర్మాధికారమున్నదనేది వీరి సిద్ధాంతం.**

ఈ రకంగా వ్యాసునికన్న ముందుగా పరబ్రహ్మను గురించి ఆలోచించిన వాళ్ళు, బ్రహ్మసూత్రాలు చెప్పినవారు కొంతమంది ఉన్నారు. కాని వ్యాసుడు చెప్పి బ్రహ్మసూత్రాలే అత్యంత ప్రామాణికము.

***దీంతో బ్రహ్మసూత్రాలలోని***

***నాల్గవ అధ్యాయంలోని నాల్గవ పాదం పూర్తయింది.***

*బ్రహ్మసూత్ర భాష్యము సమాప్తము.*

*సర్వేజనాః సుఖినోభవంతు*

*సమస్త సన్మంగళాని భవంతు*

*ఓం తత్సత్*

# 196. బ్రహ్మసూత్రాలు

## మొదటి అధ్యాయం

## మొదటి పాదం

**1. అథాతోబ్రహ్మజిజ్ఞాసా**

**2. జన్మాద్యస్య యతః**

**3. శాస్త్రయోనిత్వాత్**

**4. తత్తు సమన్వయాత్**

**5. ఈక్షతేర్నాశబ్దాత్**

6. గౌణశ్చేన్నాత్మశబ్దాత్

7. తన్నిష్ఠస్య మోక్షోపదేశాత్

8. హేయాత్వావచనాచ్చ

9. స్వాప్యయాత్

10. గతిసామాన్యాత్

11. శ్రుతత్వాచ్చ

**12. ఆనన్దమయోఽభ్యాసాత్**

13. వికారశబ్దాన్నేతి చెన్న ప్రాచుర్యాత్

14. తద్ధేతువ్యపదేశాచ్చ

15. మాన్త్రవర్ణికమేవ చ గీయతే

16. నేతరోఽనుపపత్తేః

17. భేదవ్యపదేశాచ్చ

18. కామాచ్చ నానుమానాపేక్షా

19. అస్మిన్నస్య చ తద్యోగం శాస్తి

**20. అన్తస్తద్ధర్మోపదేశాత్**

21. భేదవ్యపదేశాచ్చాన్యః

**22. అకాశస్తల్లిఙ్గాత్**

23. అత ఏవ ప్రాణః

**24. జ్యోతిశ్చరణాభిధానాత్**

25. ఛన్దోభిధానాన్నేతి చేన్న తథా చేతోర్పణనిగదాత్తథాహి దర్శనమ్

26. భూతాదిపాదవ్యపదేశోపపత్తేశ్చైనమ్

27. ఉపదేశభేదాన్నేతిచేన్నోభయస్మిన్నప్య విరోధాత్

**28. ప్రాణస్తథానుగమాత్**

29. న వక్తురాత్మోపదేశాదితి చేద ధ్యాత్మసంబన్ధభూమా హ్యస్మిన్

30. శాస్త్రదృష్ట్యా తూపదేశో వామదేవవత్

31. జీవముఖ్య ప్రాణలిఙ్గాన్నేతి చేన్నోపాసాత్రైవిధ్యాదాశ్రితత్వాదిహ తద్యోగాత్

## మొదటి అధ్యాయం

## రెండవ పాదం

**32. సర్వత్ర ప్రసిద్ధోపదేశాత్**

33. వివక్షితగుణోపపత్తేశ్చ

34. అనుపపత్తేస్తు న శారీరః

35. కర్మకర్తృవ్యపదేశాచ్చ

36. శబ్దవిశేషాత్

37. స్మృతేశ్చ

38. అర్భకౌకస్త్వాత్తద్వ్యపదేశాచ్చ నేతి చేన్న నిచాయ్యత్వాదేవం వ్యోమవచ్చ

39. సంభోగప్రాప్తిరితి చేన్న వైశేష్యాత్

**40. అత్తా చరాచరగ్రహణాత్**

41. ప్రకరణాచ్చ

42. గుహాం ప్రవిష్టావాత్మానౌ హి తద్దర్మనాత్

43. విశేషణాచ్చ

**44. అన్తర ఉపపత్తేః**

45. స్థానాదివ్యపదేశాచ్చ

46. సుఖవిశిష్టాభిధానాదేవ చ

47. శ్రుతోపనిషత్కగత్యభిధానాచ్చ

48. అనవస్థితేరసంభవాచ్చ నేతరః

49. అన్తర్యామ్యధిదైవాదిషు తద్ధర్మవ్యపదేశాత్

50. న చ స్మార్తమతద్ధర్మాభిలాపాత్

51. శారీరశ్చోభయేపి హి భేదేనైనమధీయతే

**52. అదృశ్యత్వాదిగుణకో ధర్మోక్తేః**

53. విశేషణభేదవ్యపదేశాభ్యాం చ నేతరౌ

54. రూపోపన్యాసాచ్చ

**55. వైశ్వానరః సాధారశబ్దవిశేషాత్**

56. స్మర్యమాణమనుమానం స్యాదితి

57. శబ్దాదిభ్యోఽన్తః ప్రతిష్ఠానాన్నేతి చేన్న తథా దృష్ట్యుపదేశాదసంభవాత్పురుషమపి చైనమధీయతే

58. అతఏవ న దేవతా భూతం చ

59. సాక్షాదప్యవిరోదం జైమినిః

60. అభివ్యక్తేరిత్యాశ్మరథ్యః

61. అనుస్మృతేర్బాదరిః

62. సంపత్తేరితి జైమినిస్తథా హి దర్శయతి

63. ఆమనన్తి చైనమస్మిన్

## మొదటి అధ్యాయం

## మూడవ పాదం

**64. ద్యుభ్వాద్యాయతనం స్వశబ్దాత్**

65. ముక్తోపసృప్యవ్యపదేశాత్

66. నానుమానమతచ్ఛబ్దాత్

67. ప్రాణభృచ్చ

68. భేదవ్యపదేశాత్

69. ప్రకరణాత్

70. స్థిత్యదనాభ్యాం చ

**71. భూమా సంప్రసాదాదధ్యుపదేశాత్**

72. ధర్మోపపత్తేశ్చ

**73. అక్షరమమ్బరాన్తధృతేః**

74\. సా చ ప్రశాసనాత్

75\. అన్యభావవ్యావృత్తేశ్చ

**76. ఈక్షతికర్మవ్యపదేశాత్సః**

77\. దహర ఉత్తరేభ్యః

78\. గతిశబ్దాభ్యాం తథాహి దృష్టం లిఙ్గం చ

79\. ధృతేశ్చమహిమ్నోస్యాస్మి న్నుపలబ్ధేః

80\. ప్రసిద్ధేశ్చ

81\. ఇతరపరామర్శాత్స ఇతి చేన్నాసంభవాత్

82\. ఉత్తరాచ్చేదావిర్భూతస్వరూపస్తు

83\. అన్యార్థశ్చ పరామర్శః

84\. అల్పశ్రుతేరితి చేత్తదుక్తమ్

**85. అనుకృతేస్తస్య చ**

86\. అపి చ స్మర్యతే

87\. శబ్దాదేవ ప్రమితః

88\. హృద్యపేక్షాతు మనుష్యాధికారత్వాత్

**89. తదుపర్యపి బాదరాయణః సంభవాత్**

90\. విరోధః కర్మణీతి చెన్నానేకప్రతిపత్తేర్దర్శనాత్

**91. శబ్ద ఇతి చేన్నాతః ప్రభవాత్ప్ర త్యక్షానుమానాభ్యామ్**

92\. అత ఏవ చ నిత్యత్వమ్

93\. సమాననామరూపత్వాచ్చావృత్తా వప్య విరోధో దర్శనాత్ స్మృతేశ్చ

94\. మధ్వాదిష్వసంభవాదనధికారం జైమినిః

95\. జ్యోతిషి భావాచ్చ

96\. భావం తు బాదరాయణోస్తి హి

**97. శుగస్య తదనాదరశ్రవణాత్ తదాద్ర** వణాత్ సూచ్యతే హి

98\. క్షత్రియత్వావగతేశ్చోత్తరత్ర చైత్రరథేన లిఙ్గాత్

**99. సంస్కారపరామర్శాత్తదభావాభి లాపాచ్చ**

100\. తదభావనిర్ధారణే చ ప్రవృత్తేః

101\. శ్రవణాధ్యయనార్థప్రతిషేధాత్ స్మృతేశ్చ

**102. కమ్పనాత్**

**103. జ్యోతిర్దర్శనాత్**

**104. ఆకాశోఽర్థాన్తరత్వాదివ్యపదేశాత్**

**105. సుషుప్త్యుత్క్రాన్త్యోర్భేదేన**

**106. పత్యాదిశబ్దేభ్యః**

## మొదటి అధ్యాయం

## నాల్గవ పాదం

**107. అనుమానికమప్యేకేషామితి చేన్న శరీరరూపక విన్యస్తగృహీతేర్దర్శ యతి చ**

108. సూక్ష్మం తు తదర్హత్వాత్

109. తదధీనత్వాదర్థవత్

110. జ్ఞేయత్వావచనాచ్చ

111. వదతీతి చేన్న ప్రాజ్ఞో హి ప్రకరణాత్

112. త్రయాణామపి చైవముపన్యాసః ప్రశ్నశ్చ

113. మహద్వచ్చ

114. చమసవదవిశేషాత్

115. జ్యోతిరుపక్రమా తు తథా హ్యధీయత ఏకే

116. కల్పనోపదేశాచ్చ మధ్వాదివద విరోధః

**117. న సంఖ్యోపసంగ్రహాదపి నానాభావాదతిరేకాచ్చ**

118. ప్రాణాదయో వాక్యశేషాత్

119. జ్యోతిషైకేషామసత్యన్నే

**120. కారణత్వేన చాకాదిషు యతావ్యపదిష్టోక్తేః**

121. సమాకర్షాత్

122. జగద్వాచిత్వాత్

123. జీవముఖ్యప్రాణలిఙ్గాన్నేతి చేత్తద్వ్యాఖ్యాతమ్

124. అన్యార్థం తు జైమినిః ప్రశ్నవ్యాఖ్యానా భ్యామపి చెవమేకే

**125. వాక్యాన్వయాత్**

126. ప్రతిజ్ఞాసిద్ధేర్లిఙ్గమాశ్మరథ్యః ఉత్క్రమిష్యత

127. ఏవంభావాదిత్యౌడులోమిః

128. అవస్థితేరితి కాశకృత్స్నః

**129. ప్రకృతిశ్చ ప్రతిజ్ఞాదృష్టాన్తాను పరోధాత్**

130. అభిధ్యోపదేశాచ్చ

131. సాక్షాచ్చోభయామ్నానాత్

132. ఆత్మకృతేః పరిణామాత్

133. యోనిశ్చ హి గీయతే

134. ఏతేన సర్వే వ్యాఖ్యాతా వ్యాఖ్యాతాః

## రెండవ అధ్యాయం

## మొదటి పాదం

**135. స్మృత్యనవకాశదోషప్రసఙ్గ ఇతి చేన్నాన్య స్మృత్యనవకాశదోష ప్రసంగాత్**

136. ఇతరేషాం చానుపలబ్ధేః

137. ఏతేనయోగః ప్రత్యుక్తః

138. న విలక్షణత్వాదస్య తథాత్వం చ శబ్దాత్

139. అభిమానివ్యపదేశస్తు విశేషానుగతిభ్యామ్

140. దృశ్యతే తు

141. అసదితి చేన్న ప్రతిషేధ మాత్రత్వాత్

142. అపీతౌ తద్వత్ప్రసంగాదస మఞ్జసమ్

143. న తు దృష్టాన్తభావాత్

144. స్వపక్షదోషాచ్చ

145. తర్కాప్రతిష్ఠానాదాన్యథాను మేయమితి చేదేవమప్యనిర్మోక్ష ప్రసఙ్గః

146. ఏతేన శిష్టాపరిగ్రహా అపి వ్యాఖ్యాతాః

147. భోక్త్రాపత్తేరవిభాగశ్చే త్స్యాల్లోకవత్

148. తదనన్యత్వమారమ్భణశబ్దాదిభ్యః

149. భావే చోపలబ్ధేః

150. సత్వాచ్చావరస్య

151. అసద్వ్యపదేశాన్నేతి చేన్న ధర్మాన్తరేణ వాక్యశేషాత్

152. యుక్తేః శబ్దాన్తరాచ్చ

153. పటవచ్చ

154. యథా చ ప్రాణాది

**155. ఇతర వ్యపదేశాద్ధితాకరణాది దోషప్రసక్తిః**

156. అధికం తు భేదనిర్దేశాత్

157. అశ్మాదివచ్చ తదనుపపత్తిః

158. ఉపసంహారదర్శనాన్నేతి చేన్న క్షీరవద్ధి

159. దేవాదివదపి లోకే

160. కృత్స్నప్రసక్తిర్నిరవయవత్వ శబ్ద కోపోవా

161. శ్రుతేస్తు శబ్దమూలత్వాత్

162. ఆత్మని చైవం విచిత్రాశ్చ హి

163. స్వపక్షదోషాచ్చ

164. సర్వోపేతా చ తద్దర్శనాత్

165. వికరణత్వాన్నేతి చేత్తదుక్తమ్

166. న ప్రయోజనవత్త్వాత్

167. లోకవత్తు లీలాకైవల్యమ్

168. వైషమ్యనైర్ఘృణ్యేన సాపేక్షత్యాత్తథా హి దర్శయతి

169. న కర్మావిభాగాదితి చేన్నానా దిత్వాత్

170. ఉపపద్యతే చాప్యుపలభ్యతే చ

171. సర్వధర్మోపపత్తేశ్చ

## రెండవ అధ్యాయం

## రెండవ పాదం

**172. రచనానుపపత్తేశ్చ నానుమానమ్**

173. ప్రవృత్తేశ్చ

174. పయోమ్బువచ్చేత్తత్రాపి

175. వ్యతిరేకానవస్థితేశ్చానపేక్షత్వాత్

176. అన్యత్రాభావాచ్చ న తృణాదివత్
177. అభ్యుపగమేఽ ప్యర్థాభావాత్
178. పురుషాశ్మవదితి చేత్తథాపి
179. అఙ్గిత్వానుపపత్తేశ్చ
180. అన్యథానుమితౌ జ్ఞశక్తివిరోదాత్
181. విప్రతిషేధాచ్చాసమఞ్జసమ్
**182. మహద్దీర్ఘవద్వా హ్రస్వపరి మణ్డలాభ్యామ్**
183. ఉభయథాపి న కర్మాతస్తదభావః
184. సమవాయాభ్యుపగమాచ్చ సామ్యాదవస్థితేః
185. నిత్యమేవ చ భావాత్
186. రూపాదిమత్త్వాచ్చ విపర్యయో దర్శనాత్
187. ఉభయథా చ దోషాత్
188. అపరిగ్రహాచ్చాత్యన్తమనపేక్షా
**189. సముదాయ ఉభయహేతుకేపి తద ప్రాప్తిః**
190. ఇతరేతరప్రత్యయత్వాదితి చేన్నోత్పత్తి మాత్రనిమిత్తత్వాత్
191. ఉత్తరోత్పాదే చ పూర్వనిరోధాత్
192. అసతి ప్రతిజ్ఞోపరోధో యౌగపద్య మన్యథా
193. ప్రతిసంఖ్యా ప్రతిసంఖ్యా నిరోధాప్రాప్తే రవిచ్ఛేదాత్
194. ఉభయథా చ దోషాత్
195. ఆకాశే చావిశేషాత్
196. అనుస్మృతేశ్చ
197. నాసతో దృష్టత్వాత్
198. ఉదాసీనానామపి చైవం సిద్ధిః
199. నాభావ ఉపలబ్ధేః
200. వైధర్మ్యాచ్చనస్వప్నాదివత్
201. నభావోఽ నుపలబ్ధేః
202. క్షణికత్వాచ్చ
203. సర్వథానుపపత్తేశ్చ
204. నైకస్మిన్నసంభవాత్
205. ఏవం చాత్మాకర్త్స్న్యమ్
206. న చ పర్యాయాదప్యవిరోధోవ వికారాదిభ్యః
207. అన్త్యావస్థితేశ్చోభయనిత్యత్వా దవిశేషః
208. పత్యురసామఞ్జస్యాత్
209. సంబన్ధానుపపత్తేశ్చ
210. అధిష్ఠానానుపపత్తేశ్చ
211. కరణవచ్చేన్న భోగాదిభ్యః
212. అన్తవత్త్వమసర్వజ్ఞతా వా
213. ఉత్పత్త్యసంభవాత్
214. న చ కర్తుః కరణమ్
215. విజ్ఞానాదిభావే వా తదప్రతిషేధః
216. విప్రతిషేధాచ్చ

## రెండవ అధ్యాయం
## మూడవ పాదం

**217.** న వియదశ్రుతేః

218. అస్తితు

219. గౌణ్యసంభవాత్

220. శబ్దాచ్చ

221. స్యాచ్చైకస్య బ్రహ్మశబ్దవత్

222. ప్రతిజ్ఞాహానిరవ్యతిరేకాచ్ఛబ్దేభ్యః

223. యావద్వికారం తు విభాగో లోకవత్

**224.** ఏతేన మాతరిశ్వా వ్యాఖ్యాతః

**225.** అసంభవస్తు సతోనుపపత్తేః

**226.** తేజోతస్తథాహ్యాహ

**227.** ఆపః

**228.** పృథివ్యధికారరూపశబ్దాన్తరేభ్యః

**229.** తదభిధ్యానాదేవ తు తల్లిఙ్గాత్సః

**230.** విపర్యయేణ తు క్రమోత ఉపపద్యతే చ

**231.** అన్తరావిజ్ఞానమనపీ క్రమేణ తల్లిఙ్గాది తి చేన్నా విశేషాత్

**232.** చరాచరవ్యపాశ్రయస్తు స్యాత్తద్వ్య పదే దేశో భాక్తస్తద్భావభావిత్వాత్

**233.** నాత్మాశ్రుతేర్నిత్యత్వాచ్చ తాభ్యః

**234.** జ్ఞోత ఏవ

**235.** ఉత్క్రాన్తిగత్యాగతీనామ్

236. స్వాత్మనా చోత్తరయోః

237. నాణురతచ్ఛ్రుతేరితి చేన్నేతరా ధికారాత్

238. స్వశబ్దోన్మానాభ్యాం చ

239. అవిరోధశ్చన్దనవత్

240. అవస్థితివైశేష్యాదితి చేన్నాభ్యుపగ మాద్ధృహి

241. గుణాద్వా లోకవత్

242. వ్యతిరేకో గన్ధవత్

243. తథా చ దర్శయతి

244. పృథగుపదేశాత్

245. తద్గుణసార్వత్వాత్తు తద్వ్యపదేశః ప్రాజ్ఞవత్

246. యావదాత్మభావిత్వాచ్చ న దోషస్తదర్శనాత్

247. పుంస్త్వాదివత్తస్య సతోఽభివ్యక్తి యోగాత్

248. నిత్యోపలబ్ధ్యనుపలబ్ధిప్రసఙ్గో న్యతర నియమో వాన్యథా

**249.** కర్తా శాస్త్రార్థవత్త్వాత్

250. విహారోపదేశాత్

251. ఉపాదానాత్

252. వ్యపదేశాచ్చ క్రియాయా న చేన్నిర్దేశవిపర్యయః

253. ఉపలబ్ధివదనియమః

254. శక్తివిపర్యయాత్

255. సమాధ్యభావాచ్చ

256. యథా చ తక్షోభయథా

257. పరాత్తు తచ్ఛ్రుతేః

258. కృతప్రయత్నాపేక్షస్తు విహిత ప్రతిషిద్ధావైయర్థ్యాదిభ్యః

**259. అంశో నానావ్యపదేశాదన్యథా చాపి దాశ కితవాదిత్వమధీయత ఏకే**

260. మన్త్రవర్ణాచ్చ

261. అపి చ స్మర్యతే

262. ప్రకాశావన్నైవం పరః

263. స్మరన్తి చ

264. అనుజ్ఞాపరిహారౌ దేహసంబన్ధా జ్జ్యోతిరాదివత్

265. ఆసన్తతేశ్చావ్యతికరః

266. ఆభాస ఏవ చ

267. అదృష్టానియమాత్

268. అభిసంధ్యాదిష్వపి చైవమ్

269. ప్రదేశాదితి చేన్నాన్తర్భావాత్

## రెండవ అధ్యాయం
## నాల్గవ పాదం

270. **తథాప్రాణాః**

271. గౌణ్యసంభవాత్

272. తత్ప్రాక్ఛ్రుతేశ్చ

273. తత్పూర్వకత్వాద్వాచః

274. సప్త గతేర్విశేషితత్వాచ్చ

275. హస్తాదయస్తు స్థితేఽతో నైవమ్

276. అణవశ్చ

**277. శ్రేష్ఠశ్చ**

**278. న వాయుక్రియే పృథగుపదేశాత్**

279. చక్షురాదివత్తత్సహశిష్ట్యాదిభ్యః

280. అకరణత్వాచ్చ న దోషస్తథా హి దర్శయతి

281. పఞ్చవృత్తిర్మనోవద్వ్యపదిశ్యతే

**282. అణుశ్చ**

**283. జ్యోతిరాద్యధిష్ఠానం తు తదామననాత్**

284. ప్రాణవతా శబ్దాత్

285. తస్య చ నిత్యత్వాత్

**286. త ఇన్ద్రియాణి తద్వ్యపదేశాదన్యత్ర శ్రేష్ఠాత్**

287. భేదశ్రుతేః

288. వైలక్షణ్యాచ్చ

**289. సంజ్ఞామూర్తికప్తిస్తు త్రివృత్కుర్వత ఉపదేశాత్**

290 మాంసాది భౌమం యథాశబ్దమితరయోశ్చ

291. వైశేష్యాత్తు తద్వాదస్తద్వాదః

## మూడవ అధ్యాయం

## మొదటి పాదం

**292. తదన్తరప్రతిపత్తౌ రంహతి సంపరిష్వక్తః ప్రశ్ననిరూపణాభ్యామ్**

293. త్ర్యాత్మకత్వాత్తు భూయస్త్వాత్

294. ప్రాణగతేశ్చ

295. అగ్న్యాదిగతిశ్రుతేరితి చేన్న భాక్తత్వాత్

296. ప్రథమేఽశ్రవణాదితి చేన్నతా ఏవ హ్యుపపత్తేః

297. అశ్రుతత్వాదితి చేన్నేష్టాదికారిణాం ప్రతీతేః

298. భాక్తం వానాత్మవిత్త్వాత్తథా హి దర్శయతి

299. కృతాత్యయేఽనుశయవాన్ దృష్టస్మృతిభ్యాం యథేతమనేవం చ

300. చరణాదితి చేన్నోపలక్షణార్థేతి కార్ష్ణాజినిః

301. ఆనర్థక్యమితి చేన్న తదపేక్షత్వాత్

302. సుకృతదుష్కృతే ఏవేతి తు బాదరిః

**303. అనిష్టాదికారిణామపి చ శ్రుతమ్**

304. సంయమనే త్వనుభూయేతరేషామారోహావరోహౌ తద్గతిదర్శనాత్

305. స్మరన్తిచ

306. అపిచ సప్త

307. తత్రాపి చ తద్వ్యాపారాదవిరోధః

308. విద్యాకర్మణోరితి తు ప్రకృతత్వాత్

309. న తృతీయే తథోపలబ్ధేః

310. స్మర్యతేఽపి చ లోకే

311. దర్శనాచ్చ

312. తృతీయశబ్దావరోధః సంశోకజస్య

**313. సాభావ్యాపత్తిరుపపత్తేః**

**314. నాతిచిరేణవిశేషాత్**

315. అన్యాధిష్ఠితే పూర్వవదభిలాపాత్

316. అశుద్ధమితిచేన్న శబ్దాత్

317. రేతసిగ్యోగోఽథ

318. యోనేః శరీరమ్

## మూడవ అధ్యాయం

## రెండవ పాదం

**319. సంధ్యే సృష్టిరాహ హి**

320. నిర్మాతారం చైకే పుత్రాదయశ్చ

321. మాయామాత్రం తు కార్త్స్న్యేనాభివ్యక్తస్వరూపత్వాత్

322. సూచకశ్చ హి శ్రుతేరాచక్షతే చ తద్విదః

323. పరాభిధ్యానాత్తు తిరోహితం తతో హ్యస్య బన్ధ విపర్యయౌ

324. దేహయోగాద్వాసోఽపి
325. తదభావో నాడీషు తచ్ఛ్రుతే రాత్మని చ
326. అతః ప్రబోధోఽస్మాత్
327. స ఏవ తు కర్మానుస్మృతిశబ్ద విధిభ్యః
**328. ముగ్ధేఽర్ధసంపత్తిః పరిశేషాత్**
**329. న స్థానతోఽపి పరస్యోభయలిఙ్గం సర్వత్ర హి**
330. న భేదాదితి చేన్నప్రత్యేకమతద్వ చనాత్
331. అపి చైవమేకే
332. అరూపవదేవ హి తత్ప్రదానత్వాత్
333. ప్రకాశవచ్చావైయర్థ్యాత్
334. ఆహ చ తన్మాత్రమ్
335. దర్శయతి చాథో అపి స్మర్యతే
336. అత ఏవ చోపమా సూర్యకాదివత్
**337. అమ్బువదగ్రహణాత్తు న తథాత్వమ్**
338. వృద్ధిహ్రాసభాక్త్వమన్తర్భావాదు భయసామఞ్జస్యాదేవమ్
339. దర్శనాచ్చ
**340. ప్రకృతైతావత్త్వం హి ప్రతిషేధతి తతో బ్రవీతి చ భూయః**
341. తదవ్యక్తమాహ హి
342. అపి సంరాధనే ప్రత్యక్షానుమా నాభ్యామ్
343. ప్రకాశాదివచ్చావైశేష్యం ప్రకాశశ్చ కర్మణ్యభ్యాసాత్
344. అతోఽనన్తేన తథాహి లిఙ్గమ్
345. ఉభయవ్యపదేశాత్త్వహి కుణ్డలవత్
346. ప్రకాశాశ్రయవద్వా తేజస్త్వాత్
347. పూర్వవద్వా
348. ప్రతిషేధాచ్చ
**349. పరమతః సేతూన్మానసంబన్ధ భేదవ్య పదేశేభ్యః**
350. సామాన్యాత్తు
351. బుద్ధ్యర్థః పాదవత్
352. స్థానవిశేషాత్ ప్రకాశాదివత్
353. ఉపపత్తేశ్చ
354. తథాన్యప్రతిషేధాత్
355. అనేన సర్వగతత్వమాయామ శబ్దాదిభ్యః
**356. ఫలమత ఉపపత్తేః**
357. శ్రుతత్వాచ్చ
358. ధర్మం జైమినిరత ఏవ
359. పూర్వం తు బాదరాయణో హేతువ్యపదేశాత్

## మూడవ అధ్యాయం

## మూడవ పాదం

**360. సర్వవేదాన్త ప్రత్యయం చోదనా ద్యవిశేషాత్**

361. భేదాన్నేతి చేన్నైకస్యామపి

362. స్వాధ్యాయస్య తథాత్వేన హి సమాచారేఽధికారాచ్చ సవవచ్చ తన్నియమః

363. దర్శయతిచ

**364. ఉపసంహారోఽర్థాభేదాద్విధి శేషవత్ సమానే చ**

**365. అన్యథాత్వం శబ్దాదితి చేన్నా విశేషాత్**

366. న వా ప్రకరణభేదాత్పరోవరీయ స్త్వాదివత్

367. సంజ్ఞాతశ్చేత్తదుక్తమస్తి తు తదపి

**368. వ్యాప్తేశ్చ సమఞ్జసమ్**

**369. సర్వాభేదాదన్యత్రేమే**

**370. ఆనన్దాదయః ప్రధానస్య**

371. ప్రియశిరస్త్వాద్యప్రాప్తిరుపచయా పచయౌ హి భేదే

372. ఇతరే త్వర్థసామాన్యాత్

**373. ఆధ్యానాయ ప్రయోజనాభావాత్**

374. ఆత్మశబ్దాచ్చ

**375. ఆత్మగృహీతిరితరవదుత్తరాత్**

376. అన్వయాదితి చేత్స్యాదవ ధారణాత్

**377. కార్యాఖ్యానాదపూర్వమ్**

378. సమాన ఏవం చాభేదాత్

379. సంబన్ధాదేవమన్యత్రాపి

380. న వా విశేషాత్

381. దర్శయతి చ

**382. సంభృతిద్యువ్యాప్త్యపి చాతః పురుషవిద్యాయామివ**

**383. చేతరేషామనామ్నానాత్**

**384. వేధాద్యర్థభేదాత్**

**385. హానౌ తూపాయనశబ్దశేషత్వాత్ కుశాచ్ఛన్దస్తుత్యుపగానవత్త దుక్తమ్**

**386. సాంపరాయే తర్తవ్యాభావాత్తథా హ్యన్యే**

387. ఛన్దత ఉభయావిరోధాత్

**388. గతేరర్థవత్త్వముభయథా న్యథా హి విరోధః**

389. ఉపపన్నస్తల్లక్షణార్థోపలబ్ధేః లౌకికవత్

**390. అనియమః సర్వాసామవిరోధః శబ్దానుమానాభ్యామ్**

391. యావదధికారమవస్థితిరాధికా రికాణామ్

392. అక్షరధియాం త్వవరోధః సామాన్య తద్భావాభ్యా మౌపసదవత్తదుక్తమ్

**393. ఇయదామననాత్**

**394. అన్తరాభూతగ్రామవత్స్వాత్మనః**

395. అన్యథా భేదానుపపత్తిరితి చేన్నోప దేశాన్తరవత్

396. వ్యతిహారో విశింషన్తి హీతరవత్

**397. సైవ హి సత్యాదయః**

**398. కామాదీతరత్ర తత్ర చా యతనాదిభ్యః**

**399. ఆదరాదలోపః**

400. ఉపస్థితేఽ తస్తద్వచనాత్

**401. తన్నిర్ధారణానియమస్తద్దృష్టేః పృథగ్ఘ్యప్రతిబన్ధః ఫలమ్**

**402. ప్రదానవదేవ తదుక్తమ్**

**403. లిఙ్గభూయస్త్వాత్తద్ధి బలీయస్తదపి**

404. పూర్వవికల్పః ప్రకరణాత్ స్యాత్ క్రియామానసవత్

405. అతిదేశాచ్చ

406. విద్యైవ తు నిర్ధారణాత్

407. దర్శనాచ్చ

408. శ్రుత్యాదిబలీయస్త్వాచ్చ న బాధః

409. అనుబన్ధాదిభ్యః ప్రజ్ఞాన్తర పృథక్త్వవత్ దృష్టశ్చ తదుక్తమ్

410. న సామాన్యాదప్యులబ్ధేర్మృత్యువన్న హి లోకాపత్తిః

411. పరేణ చ శబ్దస్య తాద్విధ్యం భూయస్త్వాత్త్వనుబన్ధః

**412. ఏక ఆత్మనః శరీరే భావాత్**

413. వ్యతిరేకస్తద్భావభావిత్వాన్న తూపలబ్ధివత్

414. అఙ్గావబద్ధాస్తు న శాఖాసు ప్రతివేదమ్

415. మన్త్రాదివద్వావిరోధః

**416. భూమ్నః క్రతువజ్జ్యాయస్త్వం తథాహి దర్శయతి**

**417. నానా శబ్దాదిభేదాత్**

**418. వికల్పోఽ విశిష్టఫలత్వాత్**

**419. కామ్యాస్తు యథాకామం సముచ్చీ యేరన్న వా పూర్వ హేత్వభావాత్**

**420. అఙ్గేషు యథాశ్రయభావః**

421. శిష్టేశ్చ

422. సమాహారాత్

423. గుణసాధారణ్యశ్రుతేశ్చ

424. న వా తత్సహభావాశ్రుతేః

425. దర్శనాచ్చ

## మూడవ అధ్యాయం

## నాల్గవ పాదం

**426. పురుషార్థోఽతః శబ్దాదితి బాదరాయణః**

427. శేషత్వాత్పురుషార్థవాదో యథాన్యేష్వితి జైమినిః

428. ఆచారదర్శనాత్

429. తచ్ఛ్రుతేః

430. సమన్వారమ్భణాత్

431. తద్వతో విధానాత్

432. నియమాచ్చ

433. అధికోపదేశాత్తు బాదరాయణ స్యైవం తద్దర్శనాత్

434. తుల్యం తు దర్శనమ్

435. అసార్వత్రికీ

436. విభాగః శతవత్

437. అధ్యయనమాత్రవతః

438. నావిశేషాత్

439. స్తుతయేఽనుమతిర్వా

440. కామచారేణ చైకే

441. ఉపమర్దం చ

442. ఊర్ధ్వరేతస్సు చ శబ్దే హి

**443. పరామర్శం జైమినిరచోదనా చాపవదతి హి**

444. అనుష్ఠేయం బాదరాయణః సామ్యశ్రుతేః

445. విధిర్వా ధారణవత్

**446. స్తుతిమాత్రముపాదానాదితి చేత్ - నాపూర్వవత్త్వాత్**

447. భావశబ్దాచ్చ

448. పారిప్లవార్థా ఇతి చేన్న విశేషితత్వాత్

449. తథా చైకవాక్యతోపబన్ధాత్

450. అత ఏవ చాగ్నీన్ధనాద్యనపేక్షా

451. సర్వాపేక్షా చ యజ్ఞాదిశ్రుతే రశ్వవత్

452. శమదమాద్యుపేతః స్యాత్తథాపి తు తద్విధేస్తదఙ్గతయా తేషామవ శ్యానుష్ఠేయత్వాత్

**453. సర్వాన్నానుమతిశ్చ ప్రాణాత్యయే తద్దర్శనాత్**

454. అబాధాచ్చ

455. అపి చ స్మర్యతే

456. శబ్దశ్చాతో కామకారే

**457. విహితత్వాచ్చాశ్రమకర్మాపి**

458. సహకారిత్వేన చ

459. సర్వథాపి తు త ఏవోభయ లిఙ్గాత్

460. అనభిభవం చ దర్శయతి

**461.** **అన్తరా చాపి తు తద్దృష్టేః**

462. అపి చ స్మర్యతే

463. విశేషానుగ్రహశ్చ

464. అతస్త్వితరజ్జ్యాయో లిఙ్గాచ్చ

**465.** **తద్భూతస్య నాతద్భావో జైమినేరపి నియమాతద్రూపాభావేభ్యః**

**466.** **న చాధికారికమపి పతనాను మానాత్తదయోగాత్**

467. ఉపపూర్వమపి త్వేకే భావమశన వత్తదుక్తమ్

**468** **బహిస్తూభయథాపి స్మృతేరా చారాచ్చ**

**469.** **స్వామినః ఫలశ్రుతేరిత్యాత్రేయః**

470. ఆర్త్విజ్యమిత్యౌడులోమిస్తస్మైహి పరిక్రీయతే

471. శ్రుతేశ్చ

**472.** **సహకార్యన్తరవిధిః పక్షేణ తృతీయం తద్వతో విద్యాదివత్**

473. కృత్స్నభావాత్తు గృహిణోపసంహారః

474. మౌనవదితరేషామప్యుపదేశాత్

**475.** **అనావిష్కుర్వన్నన్వయాత్**

**476.** **ఐహికమప్యప్రస్తుతప్రతిషేధే తదర్శనాత్**

**477.** **ఏవం ముక్తిఫలానియమస్తదవ స్థావధృతేస్త దవస్థావధృతేః**

## నాల్గవ అధ్యాయం

## మొదటి పాదం

**478.** **ఆవృత్తిరసకృదుపదేశాత్**

479. లిఙ్గాచ్చ

**480.** **ఆత్మేతి తూపగచ్ఛన్తి గ్రాహయన్తి చ**

**481.** **న ప్రతీకేన హి సః**

**482.** **బ్రహ్మదృష్టిరుత్కర్షాత్**

**483.** **ఆదిత్యాదిమతయశ్చాఙ్గ ఉపపత్తేః**

**484.** **ఆసీనః సమ్భవాత్**

485. ధ్యానాచ్చ

486. అచలత్వం చాపేక్ష్య

**487.** **స్మరన్తి చ**

**488.** **యత్రైకాగ్రతా తత్రావిశేషాత్**

**489.** **ఆప్రాయణాత్తత్రాపి హి దృష్టమ్**

**490.** **తదధిగమ ఉత్తరపూర్వాఘయో రశ్లేషవినాశౌ తద్వ్యపదేశాత్**

**491.** **ఇతరస్యాప్యేవమసంశ్లేషః పాతే తు**

**492.** **అనారబ్ధకార్యే ఏవ తు పూర్వే తదవధేః**

**493.** **అగ్నిహోత్రాది తు తత్కార్యాయై తద్దర్శనాత్**

**494.** **అఽతోన్యాపి హ్యేకేషాముభయోః**

**495.** **యదేవ విద్యయేతి హి**

**496.** **భోగేన త్వితరే క్షపయిత్వా సంపద్యతే**

## నాల్గవ అధ్యాయం
## రెండవ పాదం

**497. వాఙ్మనసి దర్శనాచ్ఛబ్దాచ్చ**

498. అత ఏవ చ సర్వాణ్యను

**499. తన్మనః ప్రాణ ఉత్తరాత్**

**500. సోఽధ్యక్షే తదుపగమాదిభ్యః**

501. భూతేష్వతః శ్రుతేః

502. నైకస్మిన్ దర్శయతో హి

**503. సమానా చాసృత్యుపక్రమాద మృతత్వం చానుపోష్య**

**504. తదపీతేః సంసారవ్యపదేశాత్**

505. సూక్ష్మం ప్రమాణతశ్చ తథోపలబ్ధేః

506. నోపమర్దేనాతః

507. అస్యైవ చోపపత్తేరేష ఊష్మా

**508. ప్రతిషేధాదితి చేన్న శారీరాత్**

509. స్పష్టో హ్యేకేషామ్

510. స్మర్యతే చ

**511. తాని పరే తథా హ్యాహ అవిభాగో వచనాత్**

**512. తదోకోఽగ్రజ్వలనం తత్ప్రకాశిత ద్వారో విద్యాసామర్థ్యాత్తచ్ఛే పగత్యను స్మృతియోగాచ్చ**

**513. హార్దానుగృహీతః శతాధికయా**

**514. రశ్మ్యనుసారీ**

515. నిశి నేతి చేన్న సంబన్ధస్య యావద్దేహభావిత్వాద్దర్శయతి చ

**516. అతశ్చాయనేఽపి హి దక్షిణే**

517. యోగినః ప్రతిచ స్మర్యతే స్మార్తే చైతే

## నాల్గవ అధ్యాయం
## మూడవ పాదం

518. అర్చిరాదినా తత్ప్రథితేః

519. వాయుమబ్దాదవిశేషవిశేషాభ్యామ్

520. తడితోధి వరుణః సంబన్ధాత్

521. అతివాహికాస్తల్లిఙ్గాత్

522. ఉభయవ్యామోహాత్తత్సిద్ధేః

523. వైద్యుతేనైవ తతస్తచ్ఛ్రుతేః

524. కార్యం బాదరిరస్య గత్యుపపత్తేః

525. విశేషితత్వాచ్చ

526. సామీప్యాత్తు తద్వ్యపదేశః

527. కార్యాత్యయే తదధ్యక్షేణ సహాతః పరమభిధానాత్

528. స్మృతేశ్చ

529. పరం జైమినిర్ముఖ్యత్వాత్

530. దర్శనాచ్చ

531. న చ కార్యే ప్రతిపత్త్యభిసన్ధిః

532. అప్రతీకాలమ్బనాన్నయతీతి బాదరాయణ ఉభయథాఽ దోషాత్తత్క్రతుశ్చ

533. విశేషం చ దర్శయతి

## నాల్గవ అధ్యాయం

## నాల్గవ పాదం

534. సంపద్యావిర్భావః స్వేన శబ్దాత్

535. ముక్తః ప్రతిజ్ఞానాత్

536. ఆత్మా ప్రకరణాత్

537. అవిభాగేన దృష్టత్వాత్

538. బ్రాహ్మేణ జైమినిరుపన్యాసాదిభ్యః

539. చితి తన్మాత్రేణ తదాత్మకత్వాది త్యౌడులోమిః

540. ఏవమప్యుపన్యాసాత్పూర్వభా వాద విరోధం బాదరాయణః

541. సంకల్పాదేవ తు తచ్ఛ్రుతేః

542. అత ఏవ చానన్యాధిపతిః

543. అభావం బాదరిరాహ హ్యేవమ్

544. భావం జైమినిర్వికల్పామననాత్

545. ద్వాదశాహవదుభయవిధం బాదరాయణోఽ_తః

546. తన్వభావే సంధ్యవదుపపత్తేః

547. భావే జాగ్రద్వత్

548. ప్రదీపవదావేశస్తథా హి దర్శయతి

549. స్వాప్యయసంపత్త్యోరన్యత రాపేక్షమావిష్కృతం

550. జగద్వ్యాపారవర్జం ప్రకరణాదసం నిహితత్వాచ్చ

551. ప్రత్యక్షోపదేశాదితి చేన్నాధికారిక మణ్డలస్థోక్తేః

552. వికారావర్తి చ తథా హి స్థితిమాహ

553. దర్శయతశ్చైవం ప్రత్యక్షానుమానే

554. భోగమాత్రసామ్యలిఙ్గాచ్చ

555. అనావృత్తిః శబ్దాదనావృత్తిః శబ్దాత్